# శతకాల్లో రత్నాలు




రచన

**డా॥ ఆర్. కమల**

తెలుగు ఉపన్యాసకురాలు

ప్రథమ ముద్రణ 2002

ప్రతులు : 2000

**వెల : రూ. 20/-**

ప్రతులకు
**మహావాది రాఘవేంద్ర**
శ్రీ సత్యసాయి సరస్వతి టవర్స్,
ఫ్లాట్ నం. 202 గగన్‌మహల్
హైదరాబాద్ -29 ఫోన్ : 7602929

అన్ని ప్రముఖ పుస్తక షాపులు
సుల్తాన్‌బజార్ హైదరాబాద్

**కంపోజింగ్ :**
**ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్**
బాగ్‌లింగంపల్లి హైదరాబాద్ - 44
ఫోన్ : 7660000

ముద్రణ :
**సాయిరాం ప్రింటర్స్**
సైఫాబాద్, హైదరాబాద్ - 4
ఫోన్ : 3232316

# అంకితం

కళాబంధు,

రాజ్యసభ సభ్యులు

**డా॥ టి. సుబ్బరామిరెడ్డి** గారికి



**వేదాటి రఘుపతి**
ఉపన్యాసకులు
శ్రీవేంకటేశ్వర డిగ్రీ కళాశాల
సూర్యాపేట - 508213

ఎస్‌టిడి : 08684
(ఆ) : 20167
(ఇం) : 54073

# పద్య 'కమలా'లు

వచన కవితల దుడ్డు కర్రలతో పద్యాల నడుముల్ని విరగదంతామంటు ప్రతిజ్ఞ చేసిన వారు, ఆంధ్రదేశంలో 'పద్యనిషేధం' తీసుకురావాలని ప్రయత్నించిన వారూ పోయారు. వెయ్యేళ్ళ పద్యవృక్షాన్ని పెకలించాలని చేసే వెకిలి చేష్టలకు సవాలుగా పద్యప్రక్రియ శాకోపశాఖలుగా విస్తరిస్తు, పరిమళిస్తూనే ఉంది.

సహస్ర, ద్విసహస్ర అవధాన విశేష గోష్ఠులంతో, ఆశుకవితా విలాసాలతో పద్యకవితా సదస్సులతో పద్యాల తోరణాల వంటి ప్రత్యేక కార్యక్రమాలతో పద్యపఠన పోటీలతో పులకించి పోతున్న తెలుగు నేలలో ఆబాలగోపాల రసవాకాశ వీధులలో పద్యాల పక్షులు స్వేచ్ఛగా విహరిస్తున్నాయి. హృద్యమైన పద్యాలు ధారణా శక్తికి పదును పెట్టడమే కాకుండ, మంచి పలుకుబడిని సాధించి పెడుతాయన్న నమ్మకంతో మనవాళ్ళు చిన్నప్పుడు పిల్లలకి శతక పద్యాలు, రామాయణ భారత భాగవతాది పద్యాలను కంఠస్థం చేయిస్తూండేవారు. ఆంగ్ల విద్యా వ్యామోహ ప్రభంజనంతో ఆ ఆచార్యజ్యోతి ఆరిపోతుందన్న ఆర్తితో భాషాభిమాన వదాన్యులు కొన్ని స్వచ్ఛందసంస్థలు ముందుకు వచ్చి, పద్యపారిజాతాలు ప్రతియింట పరిమళింప చేయడానికి దోహదపడుతు భాషాభారతీ సేవకు పూనుకోవడం నిజంగా ప్రశంసనీయం, ప్రాతఃస్మరణీయం.

పండిత కుటుంబ కాసారం నుండి వచ్చిన సోదరి డా॥కమల గారు సాహితీ సంస్కార సంపన్నురాలు. అధ్యయన అనుశీలనా ప్రతిభతో ఆధ్యాత్మిక చింతనతో ఇటీవల చాలా మంచి పుస్తకాలు వెలువరించారు. 800 వందల సంవత్సరాల చరిత్ర కలిగిన శతకవాఙ్మయంలో కొన్ని వేల శతకాలు మనకున్నాయి. కవితాభ్యాస దశనుండి పరిణతి చెందిన వరకు కవులు శతకరచనకు పూనుకోవడం విశేషం. ఆంధ్రభాషార్ణవంలో 'శతకరత్నాల'ను గుర్తించి వాటిలోని అపురూప పద్యాలను ఏర్చి, కూర్చి తెలుగువారికి హస్తభూషణంగా ఉండే 'శతకాల్లోరత్నాలు' అనే పుస్తకాన్ని అందిస్తున్నందుకు కమలగారిని అభినందించని వారుండరు. విద్వత్తును విద్యుత్తులా ఉపయోగించుకొనే నేర్పు, ఓర్పు ఉన్న కమల గారి ఏ రచనాప్రయత్నమైన అది పండితజనామోదమే.

పరిమళము సెడదు వాడదు
పరువము తప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేక మనో
హరమగు మన పద్యకమలమాంధ్రావనిలో

తేది
5-5-2002

మీ
**వేదాటి**

# ఆప్తవాక్యము

తెలుగు భాషలో శతకరచన సంస్కృత ప్రక్రియననుసరించి ఆరంభించినను ఇదొక విశిష్ట కావ్య ప్రక్రియగ రూపొందడము దాని ప్రత్యేకతను చాటుతున్నది. సంఖ్యా నియమము, ముక్తక స్వభావము ఆత్మాశ్రయ కవితా ధర్మము, మకుటము వంటివి ప్రధాన లక్షణాలుగా శతకాలలో కనిపించడము సర్వసాధారణము.

శతకాలు ముక్తకాలు కనుక పద్యాలు ఒక దానితో మరొకటి సంబంధము లేకపోవడమే కాక, శతక కర్త చెప్పాలనుకున్న లేదా తాను విశ్వసించిన భావాన్ని నిర్భయంగా, సూటిగా, సునిశితంగా, కొన్నిశతకాల్లో వ్యంగ్యోక్తులతో, వ్యక్తీకరిస్తాడు. చక్కటి ఉపమానాలతో నీతి, ధర్మం, తత్త్వం, భక్తి, రక్తి, వైరాగ్యం - చిన్న చిన్న మాటల్లో ఎంతో విలువైన లోతైన విషయాలు సులభగ్రాహ్యంగా రచించడం దీని ప్రత్యేకత.

చిన్న తనంలో నేర్చుకున్న విషయాలు జీవితాంతం గుర్తుంటాయి. పద్యాలవలన విషయ పరిజ్ఞానమే కాక భావ వ్యక్తీకరణకుపయోగపడే పదజాలం కూడ అలవోకగా అలవడుతుంది. సోదరి కమల విద్యార్థులకుపకరించే చక్కటి పద్యాలను సంకలనంచేసి ముద్రించి ఎందరికో అందించడం ముదావహం.

పద్యాలు విద్యార్థులకు నేర్పించవలసిన ఆవశ్యకతను గుర్తించి పద్యపఠనంలో పోటీలు నిర్వహిస్తున్న ప్రస్తుతకాలంలో, విలువైన శతక రత్నాలను ఒక్కచోట కుప్పపోసి, తెలుగుభాషామ తల్లికి ఇతోధికంగా సేవచేస్తున్న డా॥ కమల కృషి

ఎంతో హర్షించదగినది. విషయం సంక్షిప్తంగా విపులార్థద్యోతకంగా ఉండే ఈ చిన్న మణుల్లాంటి పద్యాలు విద్యార్థులలో విచక్షణా శక్తి పెంచుటకు, సదసత్ వివేక చతురత పెంపొందించుటకుపయోగపడే విధంగా కూర్చడం కమలనేర్పుకు, ఓర్పుకు మరో మైలురాయి.

**సురవరం పుష్పలత,**

ప్రిన్సిపల్, జి.పుల్లారెడ్డి జూనియర్
కళాశాల, అబిడ్స్, హైదరాబాద్

తేది : 15-5-2002

# ముఖ్యోద్దేశ్యాలు మూడు

1998లో 'ఆంధ్రకావ్యాలు - ఆణిముత్యాల' పేర భారత, భాగవత, రామాయణ ప్రబంధాల్లోని ప్రముఖ పద్యాలను కూర్చి ఒకపుస్తకం అచ్చువేసాను. ఆంధ్రదేశమంతలా అది బహుళ ప్రచారం పొందింది. టీచర్లకొరకు వేసిన ఆపుస్తకం టి.వీలో పద్యాలతోరణంలో పాల్గొనేవారి వరకు పనికొచ్చింది. అవధానాల్లో పురాణపఠనం చేసేవారికి, తెలుగు పద్యాలపై ఆసక్తి కలవారికది కరదీపికైంది. ఆరోజుల్లోనే శతకాల్లో రత్నాల్లాంటి పద్యాలనేరి విద్యార్థులు కంఠస్థం చేయడానికో పుస్తకం రాయాలనుకొన్నాను.

శ్రీ పావన సేవా సంస్థ ఆ బృహత్ప్రథకాన్ని చేపట్టింది. ఆంధ్రదేశంలోని అనుభవజ్ఞులైన పండితుల చేత వ్యాఖ్యానం చేయిస్తూ ప్రచురించింది. వ్యాఖ్యాతలు పూర్వాపరసంబంధాన్ని బట్టి భారత, భాగవత, రామాయణ, భగవద్గీత శ్లోకాలను, అర్థాలను, వారికున్న నానా విషయ విజ్ఞానాన్ని, పాండితీ ప్రకర్షను ఒకరికంటె ఒకరు తీసికట్టుగా ఉండకూడదని  వ్యాఖ్యానించారు. పట్టభద్రులాపుస్తకాల్ని భద్రపర్చుకుంటారు కాని పట్టుమని పదేళ్ళు లేని పిల్లలకు 'పిల్లి అంటే మార్జాలమని' చెప్పినట్లనిపిస్తాయా పుస్తకాలు. అందుకే చిన్న పొత్తం వేయాలనుకున్నా.

పద్యపఠనం పోటీలు  నిర్వహిస్తున్న సంస్థలు పిల్లలకు చిన్న శతకాలు అచ్చువేసి అందించారు. కాని భావం లేదు. ఇప్పుడు తెలుగు చదువుకుంటున్న పిల్లలకు అరసున్న (; బండిఱ; తెలియవు ఒకచోట పద్య పఠనం జరుగుతున్నది న్యాయ నిర్ణేతగా రమ్మన్నారు వెళ్ళాను.

పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనం

గరికిని బ్రాణము తొండము

పిరికిని బ్రాణము మగువ సిద్ధము సుమతీ! అని చదివాడా అబ్బాయి. పోటీ అయ్యాక "బాబూ! బ్రాణమంటే గరంటే" ఏంటని అడిగాను. పాపం తెల్ల మొహం వేసాడు. వెంటనే తెలీదండీ ఈ పుస్తకంలో ఇలానే ఉంది అని శైలజాపబ్లికేషన్స్‌లో ఉంది. అది విద్యార్థి తప్పుకాదని కొత్తగా వచ్చిన రోహిణీ పబ్లికేషన్ చూశాను.

గొడ్డుటావు బితుకు గుండ గొంపోయిన

బండ్ల రాలదన్ను బాలనిడదు ....ఇలా వుంది

మాతృభాషలో విద్యాబోధన ఉన్న రోజుల్లో విద్యార్థులు వేరు, కాన్వెంట్లో విద్యార్థులు వేరు. అమ్మో! చాలామంది పబ్లిషర్సు శతకాలు వేస్తున్నారని సంతోషపడ్డాను. కాని మూల విధేయులై వేస్తున్నారని గ్రహించాను. పరుషాలుండాల్సిన చోట సరళాలుంచారు. పూర్వీకులు "పొందగోరితి అంటే బొందగోరితి" అన్నారు. ఇప్పుడా పద్ధతి పనికిరాదు. ఆ పద్ధతి మార్చుకుంటే కంఠస్థం చేసి ఉత్సాహంగా పద్యాలు వేదిక నెక్కి వేలమందికి మైకులో విన్పిస్తున్నారీ విద్యార్థులు. అన్ని పద్యాలు మార్చుకున్న జనవ్యవహారంలో విన్పించే ప్రముఖ పద్యరత్నాల్ని సేకరించి సవరించాను.

6 భక్తి శతకాలు; 6 నీతి శతకాలు తీసుకొని ప్రతి దానినుండి 10,12 పద్యాలనేరుకున్నాను. వేమన పద్యాలన్నీ రత్నాలే కాని 20 మాత్రమే తీసుకున్నాను. ఏది విడవాలనిపించలేదు. అందుకే ఆయన ప్రజాకవైనాడు. మొత్తం 147 పద్యాలకు భావం మాత్రమే వ్రాసాను. అసలీ శతకాలకు అర్థతాత్పర్యాలనవసరం. కాని కాన్వెంటుల్లో చదివేవారికి, మిగతా ప్రాంతాల్లో ఉన్న తెలుగువారికి అర్థం తెలిస్తే మరింతానందిస్తారంతే. చదివే అలవాటు రానురాను పోయింది. బరువైన పుస్తకం చూస్తే పారిపోతున్నారు. భావికాలంలో ఈ మాత్రం బాషమిగలాలంటే చిన్న పుస్తకాలే

వారికవసరం. అనగా = అనగా తినగ-తినగ; మాతృభాష తెలుగైన వాడికి పేజీలు పెంచడమే తప్ప పెద్ద ప్రయోజనం లేదనిపించింది ప్రతిపదార్థంతో. అందుకే పెంచలేదు.

నా పుస్తకాలను అమితంగా ఆదరిస్తూ అడుగడుగునా ప్రోత్సహిస్తూ ఆంధ్రదేశంలోనే కాక, ఆయన వెళ్ళిన అన్ని దేశాల్లో "ఆంధ్రకావ్యాలు - ఆణిముత్యాలు" అందిస్తున్న మాన్యులు - శ్రీ త్రిపురనేని హనుమాన్ చౌదరిగారు ఐ.టి. అడ్వైజర్ టు చీఫ్ మినిస్టర్ గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గారికి నా హృదయపూర్వక వందనాలు.

ఈ పుస్తకానికి కావల్సిన ఆర్థిక సహాయం చేసిన వదాన్యులు, కళాబంధు, రాజ్యసభ సభ్యులు డా॥ టి. సుబ్బరామిరెడ్డి గారికి ధన్యవాదాలు.

అడిగిన వెంటనే తమ అమూల్యాభిప్రాయాన్ని వ్రాసి పంపిన శ్రేయోభిలాషి శ్రీవేదాటి రఘుపతిగారికి కృతజ్ఞతలు.

తలమునక పనులలో తటపటాయిస్తున్నా శతకాలు కలకాలం బతకాలని కోరుకునే వారు డా॥ సురవరం పుష్పలతగారు. ఆత్మీయతతో తమ అభిప్రాయాన్ని వ్రాసిచ్చారు ఆమెకు నా నమోవాకాలు.

అతి తక్కువ సమయంలో అచ్చుతప్పులు రాకుండా అచ్చొత్తించిన (ఫాంట్‌లైన్ డి.టి.పి) శ్రీమతి నిర్మలగారికి; అందంగా ప్రింటు చేసిచ్చిన సాయి రామ్ ప్రింటర్స్ అధినేత శ్రీ నాగేశ్వరరావుగారికి నా నమస్కారాలు.

పద్యం నిలవాలి పదికాలాలు
తెలుగు వెలగాలి కలకాలం

సాహిత్యసేవలో సదా
మీ
**కమల**

# విషయ సూచిక

# శ్రీ కృష్ణ శతకము

కవిపరిచయం :

ఆంధ్రదేశంలోని భగవన్మూర్తి పూర్వకమైన పెక్కు శతకాలు భక్తి శతకాలనే చెప్పవచ్చు. కందపద్యమయమై భక్తిరసపూరితమైన కృష్ణశతకం చాలా కాలం పాఠశాలల్లోని బాలబాలికలకు పాఠ్యగ్రంథంగా వుండేది. దీనిని రచించినవారు నృసింహకవి. ఈ శతకంలో శ్రీకృష్ణుని బాలక్రీడలు, మహిమలు మృదుమధురమై, సులభశైలిలో వర్ణించబడ్డాయి.

**శ్రీ రుక్మిణీశ! కేశవ!**
**నారద సంగీతలోల! నగధర!శౌరీ!**
**ద్వారక నిలయ!జనార్దన!**
**కారుణ్యముతోడ మమ్ము కావుము కృష్ణా!**

భా॥ సాక్షాత్ లక్ష్మీదేవి స్వరూపమైన రుక్మిణీ దేవికి భర్తయినటువంటి వాడా! ఓ కేశవా! నిరంతరం నారాయణ స్మరణచేసే పరమభక్తుడైన నారదుని సంగీతంతో పులకించేవాడా! గోవర్ధనగిరిని ఎత్తి గోవులను గోపబాలకులను రక్షించినవాడా! శూరత్వము కలిగినవాడా! ద్వారకలో నివసించేవాడా! జనార్దన! కరుణాకటాక్షాలతో మమ్ము కాపాడు కృష్ణా!

**నీవే తల్లివి తండ్రివి**
**నీవే నాతోడు నీడ నీవే సఖుడౌ**
**నీవే గురుడవు దైవము**
**నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!**

భా॥ ఓ కృష్ణా! నాకు నీవే తల్లివి, తండ్రివి, స్నేహితుడవు, గురువువు, దైవానివి. నిజంగా నీవే నాతోడునీడ సర్వస్వము.

**హరియను రెండక్షరములు**
**హరియించును పాతకముల నంబుజనాభా!**
**హరి నీ నామమహత్త్వము**
**హరిహరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా!**

భా॥ హ, రి అనే రెండక్షరాలు పలుకుతే చాలు. పాపాలన్నీ తొలగిపోతాయి. కమలాన్ని నాభియందు కలిగియున్నవాడా! ఓ పద్మనాభా! నీ నామానికున్న మహత్త్వాన్ని దేవాది దేవతలకైనా పొగడ శక్యమా! ఓ శ్రీహరీ!

**చిలుక నొక రమణి ముద్దుల**
**చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతి పేరం**
**పిలిచిన మోక్షము నిచ్చితి**
**వలరగ మిము తలచు జనుల కరుదా కృష్ణా!**

భా॥ ముద్దులొలికే చిలుకను ఒక స్త్రీ పెంచి శ్రీరామా అనే పేరుతో ప్రతిరోజు పిలిస్తే ఆమెకు మోక్షమిచ్చావు. ఇక ఎప్పుడు పిలిచే వాళ్ళకు మోక్షమివ్వకుండా వుంటావా?

**నందుని ముద్దుల పట్టివి**
**మందగిరిధరుని హరిని మాధవు విష్ణున్**
**సుందరరూపుని మునిగణ**
**వందితు నినుదలతు భక్తవత్సల కృష్ణా!**

భా॥ ఆ నందుని గారాలకొడుకువు. మందగిరి పర్వతాన్ని ధరించిన హరిని, మాధవుణ్ణి విష్ణువును, సుందరరూపుణ్ణి మునిగుణాలచే పూజింపబడే శ్రీకృష్ణుణ్ణి నిరంతరం తలచుకుంటాను ఓ భక్తవత్సలా!

**అష్టమి రోహిణి ప్రొద్దున**
**అష్టమ గర్భమున బుట్టి యా దేవకికిన్**
**దుష్టుని కంసు వధింపవె**
**సృష్టి ప్రతి పాలనంబు సేయగ కృష్ణా!**

భా॥ అష్టమినాడు రోహిణి నక్షత్రాన ఉదయాన్నే దేవకిదేవి ఎనిమిదవ సంతానంగా పుట్టి, దుష్టుడైన కంసుణ్ణి వధించలేదా? లోకాన్ని రక్షించడానికి ఓ కృష్ణా!

**దిక్కెవ్వరు ప్రహ్లాదకు**
**దిక్కెవ్వరు పాండుసుతుల దీనుల కెపుడున్**
**దిక్కెవ్వర య్యహల్యకు**
**దిక్కెవ్వరు నీవె నాకు దిక్కువు కృష్ణా!**

భా॥ పరమభక్తుడైన ప్రహ్లాదుణ్ణి రాక్షసరాజైన హిరణ్యకశ్యపుడు హరినామస్మరణ చేయవద్దని అనేక హింసలు పెడ్తే భరించాడు. 'ఏడీ! ఆ శ్రీహరి ఈస్తంభంలో ఉన్నాడా! చూపు' అని గద్దించి అడుగగా 'ఇందుగలడందులేడని సందేహంవలదు తండ్రీ' అంటూ స్తంభంలోంచి ప్రత్యక్షమై రక్షించలేదా! పాండవులను కౌరవులు లక్కయింట్లో దహనం చేయబూనగా పాండుసుతులకు నీవే దిక్కై అడుగడుగున కాపాడావు. శాపగ్రస్తురాలైన అహల్యను రాతిని నాతిగా చేసిన దేవదేవా! దీనులకు, ఆర్తులకు నీవే దిక్కువు శ్రీకృష్ణా!

**బలమెవ్వడు కరిఁబ్రోవను**
**బలమెవ్వడు పాండుసుతుల భార్యను గావన్**
**బలమెవ్వడు సుగ్రీవుకు**
**బలమెవ్వడు నాకు నీవె బలమౌ కృష్ణా!**

భా॥ బలవంతమైన గజరాజును మొసలి పట్టుకొనగా హోరాహోరి పోరాడి అలసిపోయిన ఏనుగును రక్షించలేదా! వస్త్రాపహరణ సమయాన పాండవుల భార్యను, వాలిచేత భార్య అపహరింప బడిన సుగ్రీవునికి నీవే బలం కదా. అలాంటినీవు నాకు బలానివి శ్రీకృష్ణా!

**దండమయా! విశ్వంభర!**
**దండమయా! పుండరీకదళనేత్ర!హరీ!**
**దండమయా!కరుణానిధి!**
**దండమయా! నీకు నెపుడు దండము కృష్ణా!**

భా॥ ఓ విశ్వాన్ని ధరించిన విశ్వాకారా! తెల్లని కలువ రేకుల వంటి కన్నులు కలిగినవాడా! కరుణాసముద్రుడా! నీకెప్పుడూ శతకోటి నమస్కారాలు ఓ శ్రీకృష్ణా!

**అనుదినము కృష్ణశతకము**
**వినినఁ బఠించినను ముక్తి వేడుకఁగలుగున్**
**ధనధాన్యము గోగణములు**
**తనయులు నభివృద్ధిఁ బొందుఁదద్దయు కృష్ణా!**

భా॥ ప్రతిదినము కృష్ణశతకాన్ని చదివినా, విన్నా ముక్తి లభిస్తుంది. ధన, ధాన్యాలు, పశుసంపద, పుత్రపౌత్రాభివృద్ధి తప్పక కలుగుతుంది.

# దాశరథి శతకము

కవిపరిచయం :

క్రీ.శ. 17వ శతాబ్ది చివరిభాగంలో గోల్కొండను పరిపాలించిన అబుల్ హసన్ తానీషా కాలంలో కంచర్ల గోపన్న అనే పేరుగల రామదాసుండేవాడు. ఇతడు రచించిన దాశరథీశతకం, శ్రీ కాళహస్తీశ్వర శతకంలా తెలుగులోని భక్తిశతకాల్లో ఉత్తమమైంది. ప్రతి పద్యం ఒక భక్తిరసవాహినే. ఇందలి అర్థాలంకారాలు, శబ్దాలంకారాలు చమత్కారాన్ని, వైరాగ్యాన్ని కలిగున్నాయి. మధురమైన పద ప్రయోగాలు అనన్య సామాన్యాలు. దీనికికారణం అతని హృదయమంతా నిండివున్న భక్తి భావమే. తెలుగుదేశంలో విశేష ప్రచారం పొందిన శతక రాజాల్లో ఇదొకటి. ఇందలి పద్యాలన్నీ వృత్తాలే.

శ్రీ రఘురామ చారుతులసీదళదామ శమక్షమాదిశృం
గారగుణాభిరామ త్రిజగన్నుతశౌర్యరమాలలామ దు
ర్వారకబంధరాక్షసవిరామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ

భా॥ శ్రీ రఘురామా! అందమైన తులసీదళాల మాలను ధరించినవాడా! క్షమాదయాగుణాలే అలంకారంగా కల్గినవాడా! మంచి గుణాల చేత మనోహరమైనరామా! ముల్లోకాల్లో స్తుతింపబడేవాడా! పరాక్రమమనే లక్ష్మికి అలంకారం వంటివాడా! నివారించడానికి సాధ్యంకాని, ఎదుర్కొన శక్యంకాని కబందుడనే రాక్షసుని వధించినవాడా! జనులపాపాలనెడి సముద్రాన్ని దాటింపచేయునట్టివాడా! భద్రాచలమనే పుణ్యక్షేత్రంలో వెలసిన దశరథుని కుమారుడా! దయాగుణానికి సముద్రం వంటివాడా!

**ముప్పునఁ గాలకింకరులు ముంగిట నిల్చినవేళ, రోగముల్**
**గొప్పరమైనచో కఫము కుత్తుకనిండినవేళ, బాంధవుల్**
**గప్పినవేళ, మీస్మరణ కల్గునొ, కల్గదొ నాటికిప్పుడే**
**తప్పక చేతు మీభజన, దాశరధీ, కరుణాపయోనిధీ**

భా॥ ఓ దశరథరామా! వృద్ధాప్యం (ముసలితనం) వచ్చినపుడు నేనున్న యింటివాకిట యమదూతలు వచ్చి నిల్చున్నప్పుడు, రోగముతో నున్న చివరి సమయంలో గొంతులో దగ్గు, కఫం నిండియున్నవేళ, బంధువుల్ చివరిక్షణాల్లో చూడవచ్చినపుడు దేవా! నిన్ను స్మరించగల్గుతానో లేదో, అవయవాలు స్వాధీనంలో ఉంటాయో లేవో భజన చేయడం సాధ్యంకాదేమో! అందుకే ఇప్పుడే నిన్ను సేవిస్తాను.

**చిక్కని పాలపై మిసిమి చెందిన మీగడ పంచదారతో**
**మెక్కినభంగి మీవిమలమేచకరూపసుధారసంబు నా**
**మక్కువపళ్లెరంబున సమాహితదాస్యమనేటి దోయిటన్**
**దక్కెనటంచు జుర్రెదను దాశరధీ కరుణాపయోనిధీ**

భా॥ చిక్కటి పాలను కాచినప్పుడు దానిపై వచ్చే మీగడలో చక్కెర కలిపి తిన్నట్టుగా అమృతరసంలా ఉండే స్వచ్ఛమైన నీ నల్లని రూపాన్ని నేను ప్రేమతో స్వీకరించి, దాస్య రూపమైన సేవచేసి తనవితీర అనుభవిస్తాను

**భండనభీముఁడార్తజనబాంధవుఁడుజ్జ్వలబాణతేణకో**
**దండకళాప్రచండభుజతాండవకీర్తికి రామమూర్తికిన్**
**రెండవసాటిదైవమిఁక లేఁడనుచున్ గడ్డగట్టి భేరికా**
**డాండడడాండడాండనినదంబులజాండము నిండ మత్తనే**
**దండమువెక్కి చాటెదను, దాశరధీ కరుణాపయోనిధీ.**

భా॥ శ్రీరాముడు శత్రువులకు భయంకరుడు భక్తులకు ఆపదల్లో ఉన్నవారికి చుట్టము వంటివాడు. బాణములు అమ్ముల పొదచే ప్రకాశించే విలువిద్య నెరపేవాడు, తీవ్రమైన భుజాల కదలిక నేర్పుచేత, లాఘవం చేత పొగడ్తగన్న శ్రీరామచంద్రునకు సాటి మరొకరు లేరనుచు బ్రహ్మాండమదిరిపోయేట్లుగా డాండాం అనే భేరి ధ్వనిచేస్తూ మదించిన ఏనుగునెక్కి సర్వప్రపంచంలో ప్రకటిస్తాను. శిష్టరక్షకుడు దుష్ట భంజకుడు శ్రీరామచంద్రుడు.

**పాపములొందువేళ రణపన్నగభూతభయజ్వరాదులం**
**దాపదనొందువేళ, భరతాగ్రజ మిమ్ము భజించువారికిం**
**బ్రాపుగ నీవు తమ్ముడిరు ప్రక్కియలం చని తద్విపత్తి సం**
**తాపము మాని; కాతురట దాశరథీ కరుణాపయోనిధీ**

భా॥ ఓ శ్రీరామా! పాపములు పొందేవేళ, యుద్ధము, సర్పాలు భూతాలు జ్వరాలు మొదలైన వాటిచేత ఆపద కలిగినపుడు నిన్ను తలిస్తే వారికి నీవు, నీ తమ్ముడు లక్ష్మణుడు రెండువైపుల నిలిచి వారి ఆపదలు పోగొట్టి రక్షిస్తారని నరులు చెప్తుంటారు. కనుక నిన్ను సేవించే నన్ను కాపాడవా!

**సలిలతరామనామజపసారమెరుంగను కాశికాపురీ**
**నిలయుడగాను, మీ చరణనీరజరేణుమహాప్రభావముం**
**తెలియ నహల్యగాను, జగతీవర, నీదగు సత్యవాక్యముం**
**తలపగ రావణాసురునితమ్ముడగాను, భవద్విలాసమున్**
**తలచి నుతింప నాతరమె? దాశరథీ కరుణాపయోనిధి**

భా॥ ఓ దశరథరామా! నీ నామ పారాయణం చేత కలిగే శక్తి కాశీ విశ్వేశ్వరుడికి తెలుసు. నీ పాదధూళి యొక్క మహిమ అహల్యాదేవికి తెలుసు. నీ సత్యవాక్కులోని గొప్పతనం విభీషణునికి తెలుసు. కాని నాబోటివానికి తెలియశక్యమే. తెలుసుకోవడం నాకు సాధ్యమా? నీలీలలు వివరించి చెప్పడం నా వంటివానికి సాధ్యమా!

**దాసిన చుట్టమా శబరి? దాని దయామతి నేలినావు; నీ**
**దాసుని దాసుడా గుహుడు? తావక దాస్యమొసంగినావు; నే**
**జేసిన పాపమా? వినుతి సేసిన గావవు. గావుమయ్య, నీ**
**దాసులలోన నేనొకఁడ దాశరథీ కరుణాపయోనిధీ.**

భా॥ ఓ దాశరథీ! శబరి నీకు దగ్గరి బంధువు కాకపోయినా ఆమె అతిధ్యాన్ని దయతో స్వీకరించావు. గుహుడు నీ దాసులకు సేవకుడు కాడు. అయినా దాసునిగా చేసుకున్నావు. మరి నేను చేసిన పాపమేమి? శతకరూపంలో నిన్ను స్తుతి చేసిన నన్ను కరుణించవా! నేనేమైనా పాపం చేశానా! నీకున్న అనేకమంది దాసులలో నేనొకణ్ణికాదా! నన్ను దయ చూడవా?

**కోతికి శక్యమా యసురకోటుల గెల్వను? గెల్చె బో నిజం**
**బాతనిమేన శీతకరుడౌట దవానలు డెట్టివింత? మా**
**సీత పతివ్రతామహిమ సేవకుభాగ్యము మీ కటాక్షమున్**
**ధాతకు శక్యమా పొగడ? దాశరథీ కరుణాపయోనిధీ**

భా॥ రామా! నీకరుణా కటాక్షం చేత ఒకకోతి అసంఖ్యాకమైన రాక్షసులను జయించగలిగింది. వానరుని తోకకంటించిన నిప్పు అతనిని కాల్చివేయక, చంద్రునివలె చల్లదనాన్నివ్వడం మరింత ఆశ్చర్యం కదా. సీతాదేవి పాతివ్రత్య

మహిమవలన, ఆమె మిమ్మల్ని సేవించడం వలన, హనుమంతుడు మీకు దాసుడగుటవలన ఇలా జరిగింది. కనుక సీతాదేవి పాతివ్రత్యాన్ని, హనుమంతుడు మీకు చేసిన సేవను మీదయా గుణాన్ని బ్రహ్మకైనా పొగడ శక్యమా!

**చరణము సోకినట్టి శిల జవ్వనిరూపగుటొక్క వింత, సు**
**స్థిరముగ నీటిపై గిరులు తేలినదొక్కటి వింత గాని, మీ**
**స్మరణ దనర్చు మానవులు సద్గతి చెందినదెంత వింత? యీ**
**ధరను ధరాత్మజారమణ! దాశరథీ కరుణాపయోనిధీ.**

భా॥ రామచంద్రా! నీ పాదాలను తాకిన శిల స్త్రీగా మారడం; సముద్రంలో వేసిన బండలు నీటమునుగకుండుట అద్భుతం. నీనామస్మరణ చేసిన వారికి మోక్షమివ్వడమేమి వింత? లోకంలో ఎవరికి మార్చశక్యము కాని వింతలు నీ లీలచే చేసి చూపించావు. వీటితో పోలిస్తే స్మరిస్తే మోక్షం ఎవరైనా, ఏ దేవుడైనా ఇస్తాడు. కాని ఈ వింతలు సాధ్యమా!

**ఎక్కడ తల్లి దండ్రి, సుతులెక్కడివారు, కళత్రబాంధనం**
**బెక్కడ జీవుడెట్టితనువెత్తిన పుట్టుచు పోవుచున్నావా**
**డొక్కడె, పాపపుణ్యఫలమొందిన నొక్కడె కావరాడు వే**
**రొక్కడు వెంటనంటి, భవమొల్లనయా, కృపజూడవయ్య నీ**
**తక్కరి మాయలందిడక దాశరథీ కరుణాపయోనిధీ.**

భా॥ సీతారామా! తల్లి తండ్రి కొడుకులు, భార్య అనేవారు కాలానుగుణంగా జీవితంలోకి వస్తారు. కాని శాశ్వతంగా మనతో ఉండేవారు కాదు. పుట్టేపుడు పోయేటపుడు ఒంటరివాడే. ఈ జీవుడికి ఎప్పుడు వెంట నంటి ఉండేది

పరమాత్ముడే. ఇది తెలుసు కున్నవాడికి జరామరణాలు లేవు. ముక్తి మార్గం సులభం.

**నోచినతల్లితండ్రికి తనూభవుడొక్కడె చాలు మేటి, చే**
**చాచనివాడు వేరొకడు చాచిన లేదన కిచ్చువాడు, నో**
**రాచి నిజంబుకానిపలుకాడనివాడు, రణంబులోన మేన్**
**దాచనివాడు భద్రగిరి దాశరధీ కరుణాపయోనిధీ**

భా॥ పూర్వజన్మలో తలిదండ్రులు నోములు పుణ్యవ్రతాలు చేసి ఉంటే వారికి మంచి సంతానం కలుగుతుందంటారు. పుచ్చు విత్తనాల్లాంటివారు, దేశద్రోహులు పదిమంది కంటె భక్తితో తల్లి దండ్రులను సేవించే కొడుకొక్కడు చాలు. అతడెలా ఉండాలంటే ఒకరికి దేహీ అని చేయిచాచనివాడు. ఎవరైనా చేయిచాచి అడిగితే లేదనకుండా యిచ్చే దానగుణం కలిగినవాడు, ఎల్లప్పుడు సత్యాన్నే పలికేవాడు దేశానికి విపత్తు కలిగినపుడు యుద్ధంలో పాల్గొనేవాడు, దేశమాత కొరకు ప్రాణత్యాగానికైనా సిద్ధపడేవాడొకడుంటే చాలు శ్రీరామచంద్రప్రభో.

శ్లో॥ గేయం గీతానామ సహస్రం, ధ్యేయం శ్రీపతి రూప మజస్రమ్
నేయం సజ్జన సంగే చిత్తం, దేయం దీనజనాయచ విత్తమ్ ॥భజ॥

తా॥ గీతా సహస్రనామములను పాడుకొనవలెను. ఎప్పుడూ శ్రీపతి రూపమును ధ్యానము చేయవలెను. చిత్తముతో సత్పురుషుల సాంగత్యము (అనగా సత్సంగము) చేయవలెను. దీనులకు నీ ధనమును దానము చేయుము.

# నరసింహశతకము

కవిపరిచయం :

శేషాచలదాసు అనే కవి నరసింహ శతకాన్ని రచించాడు. ఇతడు ధర్మపురి నివాసి. ధర్మపురి తెలంగాణలోని పుణ్యక్షేత్రాల్లో ఒకటి. ఇందలి సీస పద్యాలన్నీ భక్తి ప్రధానాలే అయినా, నీతి ప్రబోధకాలు కొన్ని ఉన్నాయి. "భూషణ వికాస శ్రీ ధర్మపురి నివాస దుష్ట సంహార నరసింహ దురితదూర" అనే మకుటంతో శోభిల్లుతుంటీ శతకరాజం. ఈ కవిని గూర్చి బ్రహ్మశ్రీ మానపల్లి రామకృష్ణ కవిగారు, శ్రీ వంగూరి సుబ్బారావు నైజాము మండలంలోని ధర్మపురి వాసుడని, నందికులంవాడని క్రీ.శ. 1000 పూర్వుడని తెలియజేశారు.

(చూ: 'కవిప్రశంస' నరసింహశతకం - బలివాడకృష్ణమూర్తి 1947 పరిష్కృతం)

గౌతమీ స్నానాన కడతేరుదా మంటె
　　　　మొనసి చన్నీళ్లలో - మునుగలేను
తీర్థయాత్రలచే గృ - తార్థుడౌదామంటె
　　　　బడలి నే మంబు నే - నడవలేను
దానధర్మములస - ద్గతిని చెందుదమంటె
　　　　ఘనముగా నా వద్ద - ధనములేదు
తపమాచరించి సా - ర్థకత నొందుద మంటె
　　　　నిమిషమైన మనసు - నిలువ లేదు
కష్టముల కోర్వనా చేత గాదు, నిన్ను
స్మరణ చేసెద నాయథా - శక్తి కొలది
భూషణ వికాస! శ్రీ ధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహ! దురిత దూర!

భా॥ గౌతమీ నదిలో స్నానం చేస్తే పాపకర్మలన్నీ పటాపంచల మౌతాయంటారు కాని చన్నీళ్ళలో నేను మునగలేను స్వామీ.

తీర్థయాత్రలు తిరిగితే పుణ్యం వస్తుందంటారు. కాని గుళ్ళు గోపురాలు కొండలు మెట్లు నేను తిరుగలేను.

పోని దానధర్మాలన్నా చేద్దామంటే నా దగ్గర ధనం లేదు. తపస్సు చేసి జీవితాన్ని సార్థకం చేసికుందామంటే ఒక్కనిమిషం కూడా ధ్యానానికి మనస్సు నిలువడం లేదు.

వృద్ధుడినయ్యాను ఈ వయస్సులో కష్టాని కోర్వలేను. నా యథాశక్తి నీ నామ స్మరణ చేస్తాను నన్ను మన్నించు ఓ భూషణ వికాస శ్రీ ధర్మపుర నివాస! దుష్టసంహార! నరసింహ! దురిత దూర!

**గార్ధభంబునకేల కస్తూరి తిలకంబు**
**మర్కటంబునకేల మలయజంబు**
**శార్దూలమునకేల శర్కరాపూపంబు**
**సూకరంబునకేల - చూతఫలము**
**మార్జాలమునకేల - మల్లెపువ్వులబంతి**
**గుడ్లగూబకునేల - కుండలములు**
**మహిషంబునకు వేల - మంచి వస్త్రంబులు**
**బక సంతతికివేల - పంజరంబు**
**ద్రోహచింతన చేసెడు దుర్జనులకు**
**మధురమైనట్టి నీనామ - మంత్రమేల?**
**భూషణవికాస! శ్రీధర్మపురనివాస!**
**దుష్టసంహార! నరసింహ! దురితదూర!**

భా॥ ఓ నరసింహ! గాడిదకు కస్తూరిబొట్టు, కోతికి గంధం, పెద్దపులికి తీపి అప్పాలు పందికి మామిడిపండు, పిల్లికి మల్లెపూదండ, గుడ్లగూబకు చెవిపోగూలు దున్నపోతుకు పట్టు వస్త్రాలు, కొంగకు పంజరం, దుర్మార్గులకు నీ నామస్మరణ దేనికి? ఇవన్నీ వ్యర్థం.

**పసరంబు బందైనఁ - పసులకాపరితప్పు**
**ప్రజలు దుర్జనులైన ప్రభునితప్పు**
**భార్య గయ్యాళైనఁ - ప్రాణనాథుని తప్పు**
**తనయుఁడు దుష్టైనఁ - తండ్రితప్పు**
**సైన్యంబు చెదరిన - సైన్యనాథుని తప్పు**
**కూతురు చెడుగైన - మాతతప్పు**
**అశ్వంబు చెడుగైన - నారోహకుని తప్పు**
**ఇభమది చెడ మావ -టీని తప్పు**
**ఇట్టి తప్పు లెరుంగక యిచ్చవచ్చి**
**పటుల మెలగుదు రిప్పుడీ, యవని జనులు**
**భూషణవికాస! శ్రీధర్మపుర నివాస!**
**దుష్టసంహార! నరసింహ! దురితదూర!**

భా॥ పశువు పరుల పొలాల్లో మేసి బందెదొడ్లో పడ్తే గొడ్లకాపరి తప్పు. ప్రజలు దుర్జనులైతే పరిపాలకుల తప్పు. భార్య గయ్యాళైతే భర్త తప్పు. తనయుడప్రయోజకుడైతే తండ్రితప్పు. సరియైన శిక్షణ సైన్యానికి లేకుంటే సేనాధ్యక్షుడితప్పు. కూతురు చెడు ప్రవర్తనకలిగివుంటే తల్లి తప్పు. గుఱ్ఱం ఏనుగు సరిగా లేకుంటే అశ్వారూఢుని, మావటి వాడిదాదోషం. ఇలాంటి తప్పులనేరుగక భూమ్మీది జనులు తిరుగుతారు ఓ నరసింహా!

తల్లి గర్భమునుండి ధనము తేడెవ్వడు
వెళ్ళిపోయెడి వాడు - వెంటరాదు
లక్షాధికారైన లవణమన్నమె కాని
మెరుగు బంగారంబు మ్రింగబోడు
విత్తమార్జన చేసి విఱ్ఱవీగుటెగాని
కూడబెట్టిన సొమ్ము కుడువబోడు
పొందుగా మరుగైన - భూమిలోపలబెట్టి
దానధర్మములేక దాచిదాచి
తుదకు దొంగలకిత్తురో - దొరలకవునొ
తేనె జుంటీగలియ్యవా - తెరువరులకు!
భూషణ వికాస! శ్రీ ధర్మపుర నివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

భా॥ తల్లి కడుపులోనుండి వచ్చేపుడు ఎవడు ధనం తీసుకురాడు. వెళ్ళిపోయేనాడు వెంటరాదు. లక్షలు కోట్లు గడించిన ఉప్పు అన్నమే తప్ప మెరిసే బంగారాన్ని తినలేరు. బాగా డబ్బుసంపాదించానని విఱ్ఱవీగడమే తప్ప దాచిపెట్టిన ధనాన్ని అనుభవించలేడు. లోభత్వంతో కూడబెట్టిన ధనాన్ని దాచి దాచి దానధర్మాలు చేయక చనిపోతారు. చివరకు దొంగలపాలౌతుందో, దొరలకే దక్కుతుందో ఎవరికి తెలుసు శ్రీనరసింహ ప్రభూ.

బ్రతికి నన్నాళ్ళు నీ భజన - తప్పను గాని
మరణ కాలము నందు - మరతునేమొ!
ఆవేళ యమదూత - లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి - పట్టునపుడు

కఫవాత పైత్యముల్ - గప్పగా భ్రమచేత
గంపముద్భవమంది - కష్టపడుచు
నా జిహ్వతో నిన్ను - 'నారాయణ' యంచు
పిలుతునో శ్రమచేత - పిలువలేనొ!
నాటికిప్పుడె భక్తి నీ - నామ భజన
తలచెదను చెవి వినవయ్య - ధైర్యముగను
భూషణ వికాస! శ్రీ ధర్మపురనివాస!
దుష్టసంహార నరసింహ! దురితదూర!

భా॥ స్వామీ! బ్రతికి యున్నంతకాలం నీ భజన తప్పక చేస్తాను. కాని అంత్యకాలంలో మరిచిపోతానేమో. యమదూతలు పదనడువుమని పాశం వేసినపుడు; కఫవాత పైత్యముల చేత నోట మాటరాక నా నాలుకతో నిన్ను 'నారాయణ' అని పిలుతునో లేదో అందుకే నీ చెవిలో పడేట్టు ఇప్పుడీ భజన చేస్తా వినవయ్యా!

అధిక విద్యావంతుల ప్రయోజకులైరి
పూర్ణశుంఠలు సభా - పూజ్యులైరి
సత్యవంతుల మాట - జనవిరోధంబాయె
వదరుబోతుల మాట - వాసికెక్కె
ధర్మవాదవపరుల్ - దారిద్ర్యమొందిరి
పరమలోభులు - ధన ప్రాప్తులైరి
పుణ్యవంతులు రోగ - భూతపీడితులైరి
దుష్టమానవులు వర్ధిష్ణులైరి
పక్షివాహన! మావంటి - భిక్షుకులకు
శక్తి లేదాయె నిక నీవె చాటు మాకు
భూషణ వికాస! శ్రీ ధర్మపురనివాస!
దుష్ట సంహార! నరసింహ! దురితదూర!

భా॥ బాగా చదివి డిగ్రీలు సంపాదించిన వాళ్ళు ఉద్యోగాలు దొరకక తమ ప్రతిభను ప్రదర్శించక పోవడంతో పరమ శుంఠలు సభల్లో పూజింప బడుతున్నారు. ఎవరైనా సత్యం మాట్లాడితే జనుల్లో విరోధి అవుతున్నాడు 'యదార్థవాది లోకవిరోధి' అనే లోకోక్తి ఉండనేఉన్నది. వేదికల మీద వాగ్దానాలు చేసే వదురుబోతుల మాటలు వార్త కెక్కుతున్నాయి. నీతి నియమాలతో సంపాదించేవాడు దారిద్ర్యాననుభవిస్తున్నాడు. పిసినారులు డబ్బుకూడబెడ్తున్నారు. పుణ్యాత్ములు రోగాలతో బాధపడ్తున్నారు. దుర్మార్గులు "పాపి చిరాయువని" బతుకుతున్నారు. ఓ పక్షివాహనా! నావంటి వారికి ఈలోకంలో బ్రతుక శక్తిలేదు స్వామీ! నీవే దిక్కు.

**అతివిద్య నేర్చుట - యన్న వస్త్రములకే**
**పశులనార్జించుట పాలకొరకె**
**సతిని బెండ్లాడుట సంసారసుఖముకే**
**సుతుల బోషించుట గతుల కొరకె**
**సైన్యముల్ గూర్చుట శత్రుభయంబుకే**
**సామునేర్చుట తెల్ల - చావుకొరకె**
**దావమిచ్చుటలుముందటి పంచితమునకె**
**ఘనముగా జదువుటల్ కడుపుకొరకె**
**ఇతరకామంబు గోరక సతతముగను**
**భక్తినీయందు నిల్పుట ముక్తి కొరకె**
**భూషణవికాస! శ్రీధర్మపురనివాస!**
**దుష్టసంహార! నరసింహ!దురితదూర!**

భా॥ కోటివిద్యలు కూటికొరకే. పశుసంపద పెంచడం పాలు పితికి అమ్ముకోవడానికే. వివాహం చేసుకోవడం సంసార సుఖాలనుభవించడానికే.

చతురంగ బలాన్ని చేకూర్చడం శత్రువు తనమీద దాడిచేసినప్పుడు రక్షించుకోవడానికే. దానధర్మాలు చేయడం వచ్చే జన్మకు సంచితమే. ఇంకేకోరికలు కోరక నీయందే చిత్తాన్ని నిల్పడం ముక్తి కోరకే ప్రభూ జనులు చేసేప్రతి పని స్వార్థంతో కూడిందే.

**ధరణిలోపలనేను తల్లిగర్భమునందు**
**బుట్టినప్పటినుండి పుణ్యమెరుగ**
**ఏకాదశీ వ్రతంబెన్నడుండగలేదు**
**తీర్థయాత్రలకైన తిరుగులేదు**
**పారమార్థికమైన పనులు సేయగ లేదు**
**భిక్షమొక్క నికైన పెట్టలేదు**
**జ్ఞానవంతులకైన పూని మ్రొక్కగలేదు**
**ఇతర దానములైన నియ్యలేదు**
**నళినదళనేత్ర! నిన్ననే నమ్మినాను**
**చేరి రక్షింపవే నన్ను శీఘ్రముగను**
**భూషణవికాస! శ్రీ ధర్మపురినివాస**
**దుష్టసంహార!నరసింహ!దురితదూర!**

భా॥ భూమ్మీద నేను పుట్టి బుద్దెరిగినప్పటినుండి ఏ పుణ్యకార్యం చేయలేదు. కనీసం ఏకాదశి రోజు ఉపవాసమైనా వుండలేదు. ఏ పుణ్యనదిలో మునగలేదు. యాత్రాస్థలాలు చూడలేదు. పరోపకార కార్యక్రమాలేవి చేయలేదు. పట్టుమని పట్టెడన్నం ఎవ్వనికి పెట్టలేదు. జ్ఞానసంపన్నులు సాధువులు, యోగులకెవరికి తలవంచి దండం పెట్టలేదు. పద్మపత్రాల్లాంటి కన్నులు గల స్వామీ! నిన్నే నేను నమ్ముకున్నాను. నన్ను వెంటనే రక్షించు ధర్మపురి నివాసా!

అడవి పక్షులకెవ్వడా హారమిచ్చెను
మృగజాతికెవ్వడు మేత పెట్టె?
జల చరాదులకు భోజనమెవ్వడి ప్పించె?
చెట్ల కెవ్వడు నీరు చేది పొసె
స్త్రీల గర్భంబులన్ శిశులనెవ్వడు బెంచె?
ఫణుల కెవ్వడు పోసె పరగవిషము
మధుపాళికెవ్వండు మకరందమొనరించె?
పశుల కెవ్వ డొసంగె పచ్చిపూరి?
జీవకోట్లను బోషింపనీవెకాని
వేరె యొక దాత లేదయ్య వెదకి చూడ!
భూషణవికాస! శ్రీ ధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ!దురితదూర!

భా॥ అడవిలో నివసిస్తున్న పక్షులకు ఆహారమెవడు వేళకు పెడ్తున్నాడు. జంతుజాలానికి మేత ఎవ్వడు వేస్తున్నాడు. నీటిలో నివసించే చేపలకు కప్పలకు భోజనం ఎవడిప్పిస్తున్నాడు. చెట్లకు నీళ్ళు బావిలోనుండి చేది ఎవడు పోస్తున్నాడు? గర్భంలో ఉన్న శిశువు నెవరు పెంచుతున్నారు? పాముల కోరల్లో విషం మెవడు పోస్తున్నాడు. తేనెటీగలకు తేనెవరు తయారు చేయనేర్పారు? పశువులకు పచ్చి గడ్డి ఎవరేస్తున్నారు? చరాచరజగత్తులోని జీవకోటిని రక్షిస్తున్నది నీవేతప్ప వేరొకడు కాడు. భూషణ వికాస! శ్రీధర్మపురి నివాస.

హరి! నీకు పర్యంకమైన శేషుడు చాల
బవనము భక్షించి బ్రతుకుచుండు
వనువుగా నీకు వాహనమైన ఖగరాజు
గొప్ప పామును నోటగొరకుచుండు

నదిగాక నీ భార్యయైన లక్ష్మీదేవి
దినము పేరంటంబు ధిరుగుచుండు
నిన్ను భక్తులు పిల్చి నిత్యపూజలు చేసి
ప్రేమ బక్ష్యాన్నముల్ బెట్టు చుండ్రు
స్వస్థముగ నీకు గ్రాసము జరుగుచుండ
కాసు నీచేతి దొకటైన కాదు వ్యయము
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార!నరసింహ!దురితదూర!

భా॥ హరీ! ప్రతివారికి బ్రతుకు తెరువు చూపిన స్వామివి నీవు. నీకు పాన్పుగా నున్న శేషుడు గాలిని పీల్చి బతుకుతున్నాడు. నీకు వాహనమైన గరత్మంతుడు పాములని తిని జీవిస్తున్నాడు. నీ భార్యయైన లక్ష్మీదేవిని రోజు ఎవరింటికో పిల్చి నిత్యపూజలు నిత్యనైవేద్యాలు పెడ్తారు. ఏమి శ్రమపడకుండా నీకు నీవాళ్ళకు కడుపు నిండుతున్నది. ఒక పైసాకూడ నీచేత ఖర్చుకాదు. నీ కన్నీ ఉచితమే నాకలా కాదుగా స్వామీ!

సాధుసజ్జనులతో జగడ మాడినకీడు
కవులతో వైరంబు కాంచ కీడు
పరమదీనుల చిక్కబట్టి కొట్టిన కీడు
భిక్షుకులను దుఃఖపెట్టకీడు
నిరుపేదలను చూచి నిందజేసినకీడు
పుణ్యవంతులతిట్ట బొసగు కీడు
సద్భక్తులను తిరస్కారమాడినకీడు
గురునిద్రవ్యము దోచుకొనినకీడు

దుష్టకార్యము లొనరించు దుర్జనులకు
ఘనతరంబైన నరకంబు కట్టుముల్లె
భూషణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార!నరసింహ!దురితదూర!

భా॥ సాధు సజ్జనులైన వారితో గొడవపెట్టుకుంటే, హానికలుగుతుంది. కవిపండితులతో కయ్యానికి దిగితే హాని కలుగుతుది. పరమదీనులైన అభాగ్యులను దొరకపట్టికొడ్తే వారి ఉసురు తగుల్తుంది. బిచ్చగాళ్ళను దుఃఖపెట్టడం తప్పు. నిరుపేదలను జాలి దయతో చూడాలేకాని ఏడ్పించరాదు. పుణ్యాత్ములను తిట్టినహాని కల్గుతుంది. సద్భక్తులను తిరస్కరించిన, గురుని సొమ్ము దొంగలించిన దుష్టకార్యాలు చేసిన దుర్జనులు ఘోర మైన నరకాన్ని ముళ్ళెకట్టుకుంటారు.

ప్రహ్లాదుడే పాటి పైడి కానుకలిచ్చె?
మదగజంబెన్నిచ్చె మౌక్తికములు?
వారదుండెన్నిచ్చె వగలు రత్నంబుల?
హల్య నీకే యగ్రహారమిచ్చె?
ఉదుత నీకేపాటి యూడిగంబులు చేసె?
ఘనవిభీషణుడేమి కట్నమిచ్చె?
పంచపాండవులేమి లంచమిచ్చిరి నీకు?
ద్రౌపది నీకెంత ద్రవ్యమిచ్చె
నీకు వీరందరయినట్లు నేను కాన?
ఎందుకని నన్ను రక్షింప విందువదన?
భూషణవికాస! శ్రీ ధర్మపురనివాస!
దుష్టసంహార!నరసింహ! దురితదూర!

భా॥ ప్రహ్లాదుడు నీకెన్ని బంగారు కానుకలిచ్చాడు? గజేంద్రుడెన్ని ముత్యాలు బహూకరించాడు? నారదుడెన్ని రత్నాల నగలిచ్చాడు. అహల్య నీకే అగ్రహారమిచ్చింది. ఉడుత నీకేమంత సేవ చేసింది? విభీషణుడేమి కట్నాలు సమర్పించాడు? పంచపాండవులేమి లంచమిచ్చారు? ద్రౌపది నీకెంత ధనమిచ్చింది? నీకు వారందరు అయినవాళ్ళైనట్లు నేను కానా? ఎందుకు నన్ను రక్షించవు? ఓ చంద్రుని వంటి ముఖము కలిగిన స్వామీ!

**అందరేమైన నిన్నడుగవచ్చెదరంచు**
**క్షీరసాగరమందు జేరినావు**
**నీ చుట్ట సేవకుల్ నిలువకుండుటకునై**
**భయదసర్పముమీద పండినావు**
**భక్తబృందము వెంటబడి చరించెదరంచు**
**నెగిరిపోయెడి పక్షినెక్కినావు**
**దాసులు నీ ద్వారమాసింపుకుంటకై**
**మంచి యోధుల కాపునుంచి నావు**
**లావుగలవాడనైతి వులాగు నేను**
**నిన్ను జూతును? నాతండ్రి! నీరజాక్ష!**
**భూషణవికాస! శ్రీధర్మపురనివాస!**
**దుష్టసంహార!నరసింహ!దురితదూర!**

భా॥ స్వామీ! అందరు నిన్నేదో ఒకటి అడగడానికి వస్తారని తప్పించుకునేందుకు పాలసముద్రంలో మకాంపెట్టావు. నీచుట్టూచేరి భక్తులు విసిగించకుండా వుండాలని సర్పం మీద పడుకున్నావు. నిరంతరం భక్తుల సమూహం వెంట తిరుగుతారని ఎగిరిపోయే గరత్మంతునెక్కావు. నీ దాసులు నీ వాకిలిముందు పడిగాపులు కాయకుండ ఉండాలని మంచి బలవంతులు, యోధులైన ద్వారపాలకులను కాపలా పెట్టావు. అలాంటి నిన్ను నేనెలా చూసేది. నా తండ్రి నీరజాక్షా దయచూడు నరసింహా నీవే శిష్టరక్షక దుష్టసంహార.

# నారాయణ శతకము

కవిపరిచయం :

నారాయణ శతకాన్ని బమ్మెర పోతన రచించాడు. పోతన లక్కమాంబ, కేసనల పుత్రుడు. ఈతడు క్రీ.శ. 1450-1525 ప్రాంతం వాడు. భక్తి, జ్ఞాన వైరాగ్యాలీ శతకంలో బీజరూపంలో ఉన్నాయి. కవులు మహా గ్రంథ రచన తలపెట్టినప్పుడు చేయి తిరగడానికి ముందు చిన్న పుస్తకాలు రాయడం ఆచారంగా ఉండేది. అలాగే పోతన భాగవతాంధ్రీకరణకు పూర్వం దీనిని రచించి ఉండవచ్చు. భావికాలంలో భాగవతం తాను రచించనున్నట్లు ఈ శతకంలో సూచనలు చేశాడు. ఈ శతకంలో బీజరూపంగా నున్న పద్యాలు భాగవతంలో మహావృక్షాలై ఆంధ్రుల నలరించాయి. ఇందలి పద్యాలన్నీ మత్తేభ, శార్దూలాలే.

నే నీదాసుడ నీవు నాపతివి నిన్నే కాని యొం డెవ్వరిన్
ధ్యానింపం బ్రణుతింప న ట్లగుటకు న్నా నేర్చుచందంబునన్
నీ నామస్తుతు లాచరించు నెడల న్నేతప్పులుం గల్గినన్
వానిన్ లో కొను మయ్య, తండ్రి, విహిత వ్యాపార, నారాయణా!

భా॥ ఆదినారాయణా! నీవే నాకు యజమానివి. నేను నీ సేవకుడను. అంతేకాని నేనింకెవరిని ధ్యానింప, నమస్కరింపను. స్వామీ! నాకు తెలిసిన విధంగా నమస్కరించి, స్తుతిస్తాను. అలా చేస్తున్నపుడేవైన తప్పులుంటే క్షమించు తండ్రీ!

వేదం బందు సునిశ్చయుం డగు మహాదే వ్వెవ్వడో యంచు నా
వేదవ్యాస పరాశరుల్ వెదకిన న్వేరొండు లే డంచు మీ
పాదాంభోజము లెల్ల ప్రొద్దు మదిలో భావింతు రత్యున్నతిన్
శ్రీదేవీవదనారవిందమధుపా శ్రీరంగ నారాయణా!

భా॥ వేదాల్లో నిశ్చయింపబడిన గొప్ప దేవుడెవరా?అని వేద వ్యాసుడు, పరాశరుడు మొదలైన వారికి అనుమానం వచ్చి తర్కించగా నీవే తప్ప వేరొకండు లేడని గ్రహించారు. అప్పటినుండి మీ పాదపద్మాలను నిరంతరం హృదయకమలంలో భావించి ధ్యానించారు. శ్రీరంగనాయకా! నారాయణా.

**సుతదారాప్త జనాది విత్తములపై శూన్యాభిలాషుండు నై**
**యతనో ద్రేకయుతంబు లై పొదలు నయ్యేయింద్రియవ్రాతముల్**
**మృతి పొందించి దమంబునన్ శమమునన్ మీరంగ వర్తించు ని**
**ర్గతసంసారి భవత్కృపం బొరయు నో కంజాక్ష నారాయణా!**

భా॥ భార్యా పిల్లలు బంధుమిత్రులు ధనం, వస్తువులనే అశాశ్వతమైన వాటి గురించి ఆశించే నాయింద్రియాలకోరికను నశింపచేసే, నాలోని శమ దమాదులను పొగొట్టి ఈ సంసారకూపంనుండి నీకృపతో బయట పడేయి నారాయణా!

**ప్రమదం బారగ పుణ్యకాలగతులన్ భక్తి న్సమష్టింపుచున్**
**నమర న్నన్న సువర్ణ గో సలిల కన్యా ధారుని గ్రామ దా**
**నము లామ్నాయ విధోక్తి భూసురులకున్ సన్మార్గుడై యిచ్చువా**
**డమరేంద్రార్చిత వైభవోన్నతుడగు న్స్వామీద నారాయణా!**

భా॥ సంతోషంతో పుణ్యగతులకు పోవాలనుకునేవారు అన్నదానం, సువర్ణదానం గోదానం, జలదానం కన్యాదానం, భూదానం, యజ్ఞయాగాది కర్మలు చేసి సన్మార్గులై జీవించేవారు దేవలోకానికి పోతారంటారు. అలాంటివారికి పునర్జన్మ ఉండదంటారు. వారి మార్గంలో నేను పయనించేట్లు దీవించుస్వామి!

**మదిలో మత్తమభక్తి పీఠముపయిన్ మానాథ మీపాదముల్**
**గదియం జేర్చిన వాని కే నొడయడన్ కా దంచు నత్యున్నతిన్**
**వదిలుం డై నమవర్తి మృత్యువునకున్ పాఠంబుగా పల్కు మీ**
**పదపద్మార్చకు లెంత పుణ్యులో కృపాపారీణు నారాయణా!**

భా॥ స్వామీ! హృదయ పీఠంపై మీ పాదపద్మాలుంచి వాటినే స్మరిస్తూండేవానికి మృత్యువు దూరముంటుందని చెప్పుకునే మీభక్తులెంత పుణ్యాత్ములో కృపాళువు నారాయణా!

**విరతానందవియోగు లైనియతు లై నిర్భాగ్యు లై నీచు లై**
**కరుణాహీనమనస్కు లై మలిను లై కష్టాత్ములై నష్టులై**
**పరుషవ్యాధినిబద్ధులై పతితు లై భగ్నాంగు లై భ్రమగ్ననా**
**రరయ న్ని న్నొగి నాత్మయం దిడినివా రబ్జాక్ష నారాయణా!**

భా॥ బ్రహ్మానందంతో మిమ్మల్ని స్మరించేవారేకాక నిర్భాగ్యులు, నీచులు, కఠినాత్ములు హీనమనస్కులై, కష్టాత్ములై, నష్టజీవులై, దీర్ఘవ్యాధులతో బాధపడేవారై, పతితులై, భ్రష్టులై నను ఆత్మలో స్మరించ గానే వారిని కూడా కాపాడే కరుణా సముద్రడవు నారాయణా!

**వెలయన్ యౌవనకాలమందు మరుడున్ వృద్ధాప్యకాలంబునన్**
**పలు రోగంబులు నంత్య మందు యముడుం బాధింప నట్టైన యీ**
**పలుజన్మంబులు చాల తూలితి నమం పాలింపవే దేవ మీ**
**ఫలితానంద దయావలోకనము నాపై జూపు నారాయణా!**

భా॥ యౌవనకాలంలో మన్మధుడు, వృద్ధాప్యంలో అనేక రోగాలు అంత్యకాల మందు యముని బాధలు పడ్తూ, చస్తూ పుడ్తూ చాలా జన్మలెత్తాను. స్వామి! నన్ను నీలో ఐక్యం చేసుకో నీకరుణా కటాక్ష వీక్షణాలను నాపై ప్రసరించు ప్రభూ!

**పరివంధిక్రియ నొత్తి వెంట పడునప్పాపంబు తూలించి మీ**
**చరణాబ్జస్థితి పంజరంబు శరణేచ్ఛం చొచ్చితిం గావుమీ**
**బిరుదుం చూడుము మీరు సూడగ భవద్భృత్యుండు దుఃఖంబులం**
**పొరయ న్మీ కపకీర్తి కాదె శరదంభోజాక్ష నారాయణా!**

భా॥ ఇన్నాళ్ళుగా నా వెంటబడి పీడుస్తున్న పాపాలను దులిపి మీ పాదపద్మాలనే పంజరంలో చిక్కిన పక్షిని నేను. శరణాగత వత్సలుడవైన నీవు కాపాడి నీ బిరుదు సార్ధకం చేసుకో తండ్రీ! మీ కళ్ళముందే మీ సేవకుడు దుఃఖపడ్తుంటే మీ కపకీర్తి కాదా! కలువరేకులవంటి కన్నులు కలవాడా!నారాయణా!

**ఏభావంబున నిన్ దలంచె గజయూధేంద్రుండు ఆపన్ను డై**
**యేభావంబున ద్రౌప దయ్యెడ రమాధీశా మనె న్యాయసం**
**దేభావంబున నీశరణ్య మనెనో యానీకృపాదృష్టిచే**
**నాభావంబున నీతలంపు గలుగ న్నా కిమ్ము నారాయణా!**

భా॥ ఏ విధంగా నిన్ను మదిలో తలిచాడు ఆపదలో చిక్కి గజేంద్రుడు, ఏ భావంతో ద్రౌపది రమారమణా! కాకాసురుడే భావంతో నిన్ను శరణు వేడాడో యా నీకృపాదృష్టి చేత ఆ భావమే నిన్ను తలచే నాపై ప్రసరింపు.

**నీ మూర్తుల్ గన నీకథల్ విన దుదిన్ నీపాదనిర్మాల్య ని**
**ష్ఠా మోదంబు నెరుంగ, నీచరణతో యం బాడ, నై వేద్యముల్**
**నీమం బొప్ప భజింప నీజపము వర్ణింపన్ గృపం చేయవే**
**శ్రీ మించన్ బహుజన్మ జన్మములకున్ శ్రీయాదినారాయణా!**

భా॥ నీ దివ్యమంగళరూపాన్ని చూడలేదు. నీ కథలు వినలేదు నీ పాదములపై నిర్మాల్యాన్ని సంతోషంగా కళ్ళకద్దుకోలేదు. నా పాదతీర్థాన్ని పైన చల్లుకోవడానికి, నియమం తప్పకుండా నిత్య నైవేద్యాలు పెట్టడానికి, నీ నామాన్ని భజించడానికి, నీనామజపం చేయడానికి, నీ కథలు వర్ణించడానికి కృపతో నాకు దయచేయుము. ఇంతకుమించి ఏమికోరను జన్మజన్మలకు భగవత్సంబంధాన్ని కలిగి ఉండేట్లు అనుగ్రహించు శ్రీ ఆదినారాయణా!

శ్లో॥ యావత్పవనో నివసతి దేహే, తావ త్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌదేహాపాయే, భార్యా బిభ్యతి తస్మిన్కాయే ॥భజ॥

తా॥ ఎంతవరకు దేహములో ప్రాణముంటుందో అంతవరకు గృహములో నిన్ను (నీ కుశలము) గురించి పట్టించుకుంటారు. దేహమును విడిచి ప్రాణము పోయిన తరువాత తుదకు భార్య కూడా దేహం చూచి భయపడుతుంది.

# సర్వేశ్వర శతకం

కవిపరిచయం :

సర్వేశ్వర శతకకర్త యథావాక్కుల అన్నమయ్య. యథావాక్కుల వారి యింటి పేరై యుండవచ్చు. ఇతని వివరాలేవి సరిగా లేవు. కాని 'శాకాబ్దంబులు వార్ధిషట్కపర జిత్సంఖనం బ్రవర్తింప' అనే పద్యంలో కవి తను జీవించివున్న కాలాన్ని మాత్రం తెలియజేశాడు. రచనాకాలం శాలివాహన శకం 1164. ఏ ఊరివాడో తెలియదు కాని గురువుగారు "దూదికొండ మహానీయారాధన సోమేశ్వరప్రభు" అన్నాడు. ఈ దూదికొండే యిప్పటి పత్తికొండ కావచ్చు.

యథావాక్కుల అన్నమయ్య పరమ శివభక్తుడైన కవి. వీర శైవుడై వుండవచ్చు. చాల పద్యాల్లో లింగధారణ చేసుకున్న శివభక్తులను వారు శైవాంశసంభూతులని, వారి పాదతీర్థం పవిత్ర నదీజలాలతో సమానమని తెలిపిన మహాభక్తుడు. రుద్రా; శివా! వృషాధిప అనేమకుటంతో శైవారాధకుల రచనలవలె సర్వేశ్వరా! అని సంబోధించాడు ఎక్కడా శతకం అనలేదు. దీనిలోని పద్యాలు 142. తన రచనను స్తుతి, స్తవమనే పేర్కొన్నాడు.

పవనుండై, హిమధాముడై యనలుడై పానీయమై యాత్మయై
రవియై యంబరమై మహీవలయమైరమ్యాష్ట మూర్తి క్రియన్
భువనాండంబులు రక్షణాంగములుగా పుట్టించు వత్యద్భుతో
త్సవలీలా విభవంబుతోడ భవదాజ్ఞా శక్తి సర్వేశ్వరా!

భా॥ సర్వేశ్వరా! నీయొక్క అత్యద్భుత లీల వలన, ఆజ్ఞవలన పంచభూతాలను సూర్యచంద్రాదులను అష్టమూర్తి పురుషుడై తన చేష్టలతో ఈ బ్రహ్మాండాలు రక్షణాంగాలుగా పుట్టిస్తాడు.

**పలుతీర్థంబుల గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్**
**తలమీదం చిలికించుకొన్న శుచి తీర్థం బాడ భారంబు త**
**త్ఫల మత్యల్పము భక్త పాదయుగ ళాంభ స్స్పర్శ నిర్భారమై**
**యలరున్ శాశ్వత భక్తి ముక్తి ఫలదంబై యుండు సర్వేశ్వరా!**

భా॥ అనేక పుణ్యానదుల్లో మునగడం కంటె. శివభక్తుల పాదతీర్థాన్ని తలమీద చల్లుకుంటే ఎక్కువ పుణ్యం (అయస్కాంతంలో ఇనుప రజను పెట్టి కొంత కాలముంచితేదానికి అయిస్కాంతంగుణం వస్తుందంటారు. భౌతిక శాస్త్రవేత్తలు. నిరంతరం శివధ్యానంతో ఉండే శివయోగులు శివుడితో సమానమంటారు. శివభక్తులు)

**అమరన్ భక్తులకెల్ల నీవ హృదయంబై యుండుటన్ వారి సౌ**
**ఖ్యము నీ సౌఖ్యము, వారి కూర్మియు సమగ్రంబైన నీ కూర్మి త**
**త్త్వము భావింపగ వారి కోపము భవత్ప్రఖ్యాత రౌద్రప్రభా**
**వము, దా వారల వాక్య నిర్ణయము నీ వాక్యంబు: సర్వేశ్వరా!**

భా॥ భక్తుడు సుఖంగా ఉంటేనే భగవంతుడు సుఖంగా ఉంటాడంటారు. అతను బాధపడ్తూ దుఃఖిస్తూ ఉంటే అతను చేసేపూజలో ధ్యానంలో తృప్తి ఉండదు. అందుకే తన భక్తులకు సౌఖ్యాన్ని ప్రేమను భగవంతడందిస్తాడు. శివభక్తుల హృదయంలో నీవుంటావు కనుక వారికి కోపం వస్తే నీకు వచ్చినట్లే. వారి మాట నీ మాటే.

**పతి వేడ్కం దవ ప్రాణ వల్లభునితో సంయోగ మర్థించుగా**
**కతనిం ప్రార్థన పేసి సొమ్ము కొనిపో నర్రాడునే? భక్తుడీ**
**క్షితి నీ భక్తియ వేడుగాక మరి నీ శ్రీపాదము ల్గొల్చికు**
**త్సిత కామ్యార్థము లెందు వేడుకొనునే చింతింప? సర్వేశ్వరా!**

భా॥ భగవంతునికి భక్తునికి మధ్య భక్తి భావముండాలేకాని వ్యాపారధోరణి కాదు. భార్య తన భర్తతో సంయోగాన్ని కోరుకుంటుందేకాని అతని ధనం దోచుకొని వెళ్ళిపోవాలనుకోదు. నిజమైన భక్తుడు నిస్వార్థమైన భక్తినేకోరుకుంటాడు. కాని తుచ్ఛమైన కోరికలను కాదు.

**భ్రమరధ్యానము దాల్చి కీటకము సద్భావాది సంయుక్తిదా**
**భ్రమరంబై ఖగవీథి నాడు ననిన, న్భావించి నిన్నాత్మనె**
**య్యముతో ధ్యానము సేయు మర్త్యుడును నీ యట్లే పరవ్యోమ త**
**త్త్వము నందవ్యయలీల నుండు టరుదే భావింప? సర్వేశరా!**

భా॥ తుమ్మెద కీటకాన్ని తెచ్చి దాని గూటిలో పెట్టి భ్రమర శబ్దం చేస్తూ గూటి చుట్టూ తిరుగుతుంది. కొన్నాళ్ళకు కీటకం భ్రమరమౌతుంది. అలాగే నిశ్చలంగా ధ్యానం చేసే మానవుడు చిదానందస్థితికి చేరుకుంటాడు.

**అతి లాలిత్యముగా నహర్నిశము నిన్నర్చింపగా వచ్చు, సు**
**వ్రతుడై యుండగ వచ్చు, నెల్ల కళలం బ్రౌఢుండు గా వచ్చు వా**
**కృతిగా నైనను వచ్చు: గాని మరి నీ భక్తుండు కారాదు సు**
**స్థితిగా నీ దయలేని మానవునకుం చింతింప సర్వేశ్వరా!**

భా॥ ఎంతో నాజూకుగా నీపూజ చేయవచ్చు. వైభవంగా నీవ్రతం చేయవచ్చు. సమస్త విద్యల్లో పాండిత్యం సంపాదించవచ్చు. కాని నీ అనుగ్రహం లేనివాడు నీ భక్తుడు మాత్రం కాలేడు.

**కమలాప్తుండుదయింపగా ననల నక్షత్ర క్షపాధీశ తే**
**జము లెల్లం బెడ బాసి పోవు గతి నీ సద్భక్తి భావంబు చి**
**త్తము లోనం బ్రభవింపగా నితర మంత్రధ్యాన - తద్దేవతా**
**క్రమ మాయాపటలంబు లన్నియును వీకం గ్రాగు సర్వేశ్వరా!**

భా॥ సర్వేశ్వరా! సూర్యోదయ సమయాన చంద్రుని, నక్షత్రాల కాంతి ఎలా వెలవెలబోతుందో, నీమీద భక్తి భావం భక్తునిలో పుట్టగానే ఇంతకు ముందు తాను చేసే మంత్ర తంత్రాన్నీ వెల వెల పోతాయి.

**కామోద్రేక విజృంభణంబును సమగ్ర క్రోధమున్ లోభమున్**
**వ్యామోహంబు మదంబు మచ్చరము తీవ్రంబైన పంచేంద్రియా**
**ద్దామా టోపము గ్రాచి పెంపెసగు తత్త్వ జ్ఞానికిం గాక తా**
**సామాన్యాత్ముల కేల నూలు కొను నీ సద్భక్తి? సర్వేశ్వరా!**

భా॥ సర్వేశ్వరా! తీవ్రమైన అరిషడ్వర్గాలతో, తీవ్రమైన పంచేంద్రియాల ఉద్ధృతిని తపింపజేసే తత్త్వజ్ఞానికి కాక, సామన్యులకు నీయందు భక్తి ఎలాకుదురుతుంది?

**చావంపుట్టుచుపుట్టి జచ్చుచు మహాచండాల సంసార పా**
**రావారంబున కూలి తా చెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో**
**వేవం పొందక యేను నీవనుట తానే జ్ఞానమో శ్రీ మహా**
**దేవా! యిట్టి కుతర్కముం కలదె చింతింపంగ సర్వేశ్వరా!**

భా॥ చావడం కొరకు పుడ్తూ పుట్టడం కొరకు చస్తూ నీచమైన సంసార కూపంలో పడికొట్టుమిట్టాడుతున్నందుకు అసహ్యపడక నేనేదేవుణ్ణి; దేవుడేనేను, అనడం ఏమి న్యాయం? ఓమహాదేవా! ఇలాంటి కుతర్కం ఎక్కడైన ఉంటుందా?

**అమితామోద నవ ప్రసూనముల నిన్నర్చించుచో గద్య ప**
**ద్యము లూహించి నుతించుచో వివిధ గీత వ్రాతము ల్పాడుచో**
**నమృతాహారము లిచ్చుచో నిపుణుడై యాటాడుచో నందు జి**
**త్తము సద్భక్తియె నీవు చేకొను పదార్థం బెల్ల సర్వేశ్వరా!**

భా॥ సర్వేశ్వరా! సువాసనాభరితమైన పూలతో నిన్ను పూజించినా, గద్య పద్యాలలో కావ్యాలు రాసి నిన్ను స్తుతించినా; గీతాలాపాలతో నిను గానం చేసినా; మధురమైన పదార్థాలను నివేదించినా వానిలోని సద్భక్తినే నీవు గ్రహిస్తావు తప్ప ఇతరాలను కాదు.

**కాయం బన్నది వారిబుద్బుద సదృక్షం, బందు రూపింప లే**
**ప్రాయంబన్నది శారదాంబుద తటిత్ ప్రాయంబు, సంపత్సుఖ**
**శ్రేయంబన్నది మాయ - యిట్లెరిగియున్ శీఘ్రంబె నీధ్యాన సం**
**స్థాయీ భావన బొంద డేమిటికయా సంసారి సర్వేశ్వరా!**

భా॥ జీవితం నీటి బుడగలాంటిది. అందులో లేత వయసన్నది మెరుపు తీగ వంటిది. సిరిసంపదల వలన కలిగే సుఖం మాయ. ఇవన్నీ క్షణికమని తెలిసికూడ మనిషి నిన్నెందుకు ధ్యానించడో సర్వేశ్వరా!

**తరులంపువ్వులు పిందలై యొదవి తత్తజ్జాతితో పండ్లగున్**
**హర! మీ పాద పయోజపూజితములై యత్యద్భుతం బవ్విరుల్**
**కరులౌ సశ్వములౌ సువర్ణమణులౌ కర్పూరమౌ హారమౌ**
**తరుణీ రత్నములౌ పటీర తరులౌ దధ్యంబు సర్వేశ్వరా!**

భా॥ చెట్లకు పూసిన పూవులు పిందలై అదేజాతి పండ్లగును. కాని మీపాద పద్మాలమీద పడ్డ పూలు ఏనుగులు, గుర్రాలు, మణులు, కర్పూరం, హారం, స్త్రీ రత్నం, శ్రీ గంధ వృక్షమౌతాయి. ఎంతటి చిత్రం

**భవదీయార్చన సేయుచో ప్రథమ పుష్పంబెన్న సత్యంబు, రెం**
**డవ పుష్పంబు దయాగుణం, బతి విశిష్టంబేకనిష్ఠా సమో**
**త్సవ సంపత్తి తృతీయ పుష్పమది భాస్వద్భక్తి యో**
**గ విధానంబువి లేని పూజల మదింగైకోవు సర్వేశ్వరా!**

భా॥ సర్వేశ్వం! నీ పూజ చేసేటపుడు మొదటి పుష్పం సత్యం; రెండవ పుష్పం దయ; మూడోపుష్పం ఏకాగ్రత, సగుణ-నిర్గుణ పూజలో ఇది నిర్గుణ పూజావిధానం. ఈ మూడు పుష్పాలు లేని పూజ నీవంగీకరించవు.

**ఏ దేశంబున నే దిశా ముఖమునందే యూర నే వాడ మీ**
**పాదభ్యర్చవ సేయు నిర్మలుడు సద్భక్తుండొకండుండెనా**
**యాదేశంబును నాదిశా ముఖమును న్నాయూరు నావాడ గం**
**గాది స్నానదీ ప్రవాహఫలదంబై యుండు సర్వేశ్వరా!**

భా॥ మహాదేవా! ఏ దేశంలోనైనా, ఏ దిశయందైనా ఏ ఊరిలోనైనా ఏవీధిలోనైనా నీ పాదపూజ చేసే నిర్మల భక్తుడొక్కడున్నా ఆయా ప్రాంతాల్లో గంగాది తీర్థాల్లోని ఫలితముంటుంది. పరమ శివభక్తుడు జంగమ తీర్థం లాంటివాడని భావం.

# శ్రీకాళహస్తీశ్వర శతకము

కవిపరిచయం :

శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానకవి, అష్టదిగ్గజాల్లో ధూర్జటి మహాకవి ఒకరు. ఇతడు రచించిన శ్రీకాళహస్తీశ్వర శతకం భక్తి నైర్మల్యంతో భావ గంభీరంతో మృదుమధుర పదప్రయోగాలతో తెలుగు శతక వాఙ్మయాని కలంకారమని చెప్పదగింది. దీని శైలి సౌందర్యం, రచనా ప్రౌఢిమ నిరుపమానమైంది. ఈ శతకంలో కవి పశ్చాత్తాపం, వైరాగ్యం చక్కగా చిత్రింపబడ్డాయి. ఇందు రాజులను, వారు చేసే దుశ్చర్యలను అనేక విధాల నిరసించాడు. దీనిలోని శైలి ప్రౌఢమై ధారాశుద్ధితో, హృదయానికి హత్తుకునేట్లున్నది. ధూర్జటి ఆత్మీయాంశ అనేక చోట్ల కన్పిస్తుంది. ఇందన్ని మత్తేభ, శార్దూలపద్యాలే.

అంతా మిథ్య తలంచి చూచిన నరుండటౌ టెరింగిన్ సదా
కాంతల్పుత్రులు నర్థమున్ తమవు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతిచెంది చరించుగాని పరమార్థంబైన నీయందు తా
చింతాకంతయు చింత నిల్పడు కదా శ్రీకాళహస్తీశ్వరా!

భా॥ అంతా అశాశ్వతమని తెలిసికూడా మనుషులు భార్య, పిల్లలు, ధనం శరీరం అనే మోహంలో చిక్కుకుంటారు. అదే భ్రమలో పడి తిరుగుతుంటారు నిరంతరం. కాని ఈశ్వరా శాశ్వతమైన నీమీద చింతా కంత భక్తిని కలిగియుండరు కదా!

"అమ్మా! అయ్యా!" యటంచు నెవ్వరిని నేనన్నశివా నిన్ను నే
సుమ్మీ నీమది తల్లిదండ్రులటంచు న్జూడగా బోకు మా
కిమ్మై తల్లియు తండ్రియున్ గురుడు నీవే కాక సంసారపుం
చిమ్మం చీకటి గప్పినన్ గడుపుసన్ శ్రీకాళహస్తీశ్వరా!

భా॥ సంసారమనే చిమ్మ చీకటిలో జీవితం గడుపుతున్న మాకు అమ్మా! అయ్యా! అనిపిలిస్తే నిన్నేశివా! ఇంకెవరో అనుకోకు. మాకు తల్లి, తండ్రి, గురువు, దైవం అన్నీ నీవే కాళహస్తీశ్వరా!

**ఆలంచున్మెడగట్టి దానికి నపత్యశ్రేణి కల్పించి త**
**ద్బాల వ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధంబుగావించి యా**
**మాలర్కంబున బాంధవంబనెడి ప్రేమం కొందరం త్రిప్పగా**
**సీలన్సీల అమర్చినట్లొ సగితో శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ భార్య అని తెచ్చి మెడక్కట్టి, సంతానం లేకుంటే అనపత్య దోషం కల్గుతుందని చెప్పి, పిల్లలు పుట్టాక వారికి పెళ్ళిళ్ళు చేసి యిచ్చిపుచ్చుకోవడం ద్వారా సంబంధ బాంధవ్యాలేర్పర్చుకొని, ప్రేమ అనే దారంతో ముడివేసి త్రిప్పుతుంటావు స్వామీ! ఈ బంధాలొక దానితో ఒకటి చీలతో చీల అతికి గొలుసులా వింతగా అమరుస్తావు శ్రీకాళహస్తీశ్వరా!

**ఏ వేదంబు పఠించెలూత, భుజగంబే శాస్త్రముల్చూచె తా**
**వే విద్యాభ్యాసనంబొనర్చె కరి, చెంచే మంత్ర మూహించె బో**
**దావిర్భావ నిధానముల్ చదువులయ్యా! కావు! మీ పాద సం**
**సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా**

భా॥ శ్రీ=సాలెపురుగు; కాళము-పాము; హస్తి=ఏనుగు ఈ మూడు శివుని కొల్చి ముక్తి పొందాయి. భగవంతుడికి భక్తి ముఖ్యం. వాళ్ళు చిన్నవాళ్ళా? పెద్దవాళ్ళా! అని కాదు. ఆ భక్తి కలిగిఉండడానికి సాలెపురుగు ఏవేదాన్ని చదివింది. పాము ఏ శాస్త్రాలు చూసింది? ఏనుగు ఏ విద్యనభ్యసించింది? కన్నప్ప

ఏ మంత్రాన్ని చదివాడు? నిర్మలమైన భక్తితో నిన్ను సేవించారే తప్ప పెద్ద విద్యలు చదివికాదు. నీ పాదపద్మముల మీద నున్న అపార భక్తి శ్రద్ధలే ఈ జంతుజాలానికి మోక్షాన్నిచ్చాయి. శ్రీకాళహస్తీశ్వరా!

**కొడుకులు పుట్టరటంచు నేడ్తురవివేకు లీవన భ్రాంతులై**
**కొడుకుల్ పుట్టరే కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్**
**వడసెంపుత్రులు కాని ఆ శుకునకున్ వాటిల్లెనే దుర్గతుల్**
**చెడెనే మోక్షపదంబ పుత్రునకున్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ జీవితం మీద భ్రాంతి కలిగిన అవివేకులు కొందరు కొడుకులు పుట్టలేదని ఏడుస్తుంటారు. కాని కొడుకులు అనేకమంది పుట్టలేదా? కౌరవేంద్రుడైనా ధృతరాష్ట్రునికి. వారిచేత ఏగతులు పొందాడు? పుత్రులు లేని శుకమహర్షికి దుర్గతి వాటిల్లక మోక్షం దొరకలేదా! శ్రీకాళహస్తీశ్వరా!

**అంతా సంశయమే శరీర ఘటనం బంతా విచారంబె లో**
**నంతా దుఃఖ పరం పరార్జితమె మేనంతా భయభ్రాంతమే**
**యంతా నాంత శరీర శోషణమె దుర్వ్యాపారమే దేహికిన్**
**చింతన్నిన్ను తలంచి పొందరు నరుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ మనిషికి దేన్ని చూసినా అనుమానమే, జీవితమంతా విచారమే, మనుసులో ఎప్పుడూ దుఃఖమే, ఒళ్ళంతా భయంతో జలదరించడమే, శరీరం ఎల్లప్పుడూ అలసిపోవడమే, నిరంతరం చెడ్డపనులు చేయడమే కాని నిన్ను గురించి కొంచెం ధ్యానిస్తే చిత్తశుద్ధి కలుగుతుంది. కాని కాళహస్తీశ్వరా అది మాత్రం చేయరు.

**మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యము, ల్పల్లకుల్**
**ముదితల్ చిత్ర దూకులములర్విమళంబుల్మోక్షమీ జాలునే**
**మదిలో వీని నపేక్షచేసి నృపథామద్వారదేశంబు గా**
**చి దినంబుల్ వృథ పుత్తురజ్ఞులకటా శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ మదించిన ఏనుగులు, మిద్దెలు, మేడలు, మాణిక్యాలు, పల్లకీలు, వేశ్యలు, అందమైన వస్త్రాలు, పరిమళ వస్తువులు మోక్షమిస్తాయా? వీటిని కోరి రాజుల రాజద్వారాల ముందు పడిగాపులు కాస్తూ రోజులు వృథా చేసుకుంటారజ్ఞానులు శ్రీకాళహస్తీశ్వరా!

**తరగల్ పిప్పల పత్రముల్ మెరుగుటద్దంబుల్ మరుద్దీపముల్**
**కరికర్ణాంతము లెండ మావుల తతుల్ ఖద్యోతకీటప్రభల్**
**సురవీథి లిఖితాక్షరంబులసువుల్ జ్యోత్స్నా పయః పిండముల్**
**సిరులందేల మదాంధులౌదురు జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ జీవితం నీటి బుడగ లాంటిది, రాలిపడే రావి ఆకులాంటిది, మెరిసే అద్దం లాంటిది, అకాశదీపం లాంటిది, ఏనుగు చెవి చివరలు, ఎండమావులు దీపపురుగులు, ఆకాశవీధిలో వ్రాసిన అక్షరాలాంటివి ప్రాణములు. పదిహేనురోజులు మాత్రమే ఉండే వెన్నెల రాత్రుల్లాంటివి. ఇది అశాశ్వతమైందని తెలిసికూడ సిరిసంపదలతో తులతూగాలను కుంటారు. మదం చేత గ్రుడ్డివారైన జనులు శ్రీకాళహస్తీశ్వరా!

**రాజై దుష్కృతి చెందె చందురుడు రారాజై కుబేరుండు దృ**
**గ్రాజీవంబున గాంచె దుఃఖము కురుక్ష్మాపాలుడామాటనే**
**యాజంగాలె సమస్త బంధువులతో నారాజ శబ్దంబు ఛీ,**
**ఛీ జన్మాంతరమందు నొల్లను సుమీ శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ నెలరాజైన చంద్రుడు గురుపత్నిని అనుభవించి గురుశాపానికి గురైనాడు. రారాజైన కుబేరుడు చాలాకాలం దుఃఖాన్ననుభవించాడు. యువరాజైన దుర్యోధనుడు కురుక్షేత్ర యుద్ధంలో కూలిపోయినాడు బంధుమిత్రులతో సహా, అమ్మో ఆ 'రాజు' శబ్దం జన్మాంతర మందు కూడ నాకు వలదు శ్రీకాళహస్తీశ్వరా!

**రాజుల్మత్తులు వారిసేవ నరక ప్రాయంబు, వారిచ్చు నం**
**భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదులాత్మ వ్యథా**
**బీజంబుల్, తదపేక్షచాలు పరితృప్తిపొందితిన్ జ్ఞాన ల**
**క్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ రాజులు ధన కనక వస్తు వాహనాలనే మత్తులో మునిగిఉంటారు. వారికి సేవ చేయడం నరకయాతన లాంటిదే. వారిచ్చే కాంతాకనకాలు, మేనా పల్లకీలు, వడిగల గుర్రాలు, ఆభరణాలు ఆత్మలో బాధను కల్గించే విత్తనాల్లాంటివి. వీటిమీద ఆపేక్షయింక చాలు. సంతృప్తి పొందాను. జ్ఞాన లక్ష్మి నన్ను వాటినుండి జాగృతి కలిగించింది దయతో శ్రీకాళహస్తీశ్వరా!

**లేవో కానలకంద మూలఫలముల్ లేవో గుహల్ తోయముల్**
**లేవో యేరుల పల్లవాస్తరణముల్ లేవో సదా ఆత్మలో**
**లేవో నీవు విరక్తులన్మనుప జాలింబొంది భుపాలురన్**
**సేవల్సేయగ పోదురేలకో జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ సర్వాంతర్యామివైన నీవు అంతటా వ్యాపించివున్నావు. అడవుల్లో, కందమూల ఫలాల్లో, గుహల్లో, నీళ్ళల్లో ఏరుల్లో, దట్టమైన చెట్లల్లో లేవా? సదా ఆత్మలో లేవా! విరక్తులైన వారియందు జాలిపొంది రక్షించలేదా! నిన్ను సేవించక మూఢులు రాజులను సేవించ డానికి ఎందుకు పోతారో తెలియదు.

**రోసిందేటికిది రోతలేటిది మనోరోగస్థుడై దేహితా**
**పూసిందేటిది పూతలేటివి మదాపూతంబు లీదేహముల్**
**మూసిందేటిది మూతలేటివి సదా మూఢత్వమే కాని తా**
**చేసిందేటిది చేతలేటివి వృథా శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ మనిషి తానసహ్యించుకుంటాడు తానే మలినమైన మనస్సుతో రోగగ్రస్థుడైఉండి, ఒళ్ళంతా భస్మంతో పూతలు పూస్తూ ఉంటాడు. మదించిన చర్మముతో ఉండి, మూసిపెడుతూ ఉంటాడు. మూత పెట్టేది వారి మూఢత్వానికే, కాని తాను చేసిందేమిటి చేత లేమిటి వృథా కాలయాపన తప్ప శ్రీకాళహస్తీశ్వరా!

**గడియల్ రెంటికో మూటికో గడియకో కాదేని డెల్లియో**
**కడ నేడాదికో యెన్నడో యెరుగ మీ కాయంబులీభూమిపై**
**పడగా నున్నవి ధర్మమార్గమొకటిం పాటింప రీమానవుల్**
**చెడుగుల్ నీ పదభక్తియుం తెలియరో శ్రీకాళహస్తీశ్వరా!**

భా॥ ఈ శరీరం క్షణికం గంటకో, రెండుగంటలకో మూడింటికో లేదా ఏడాదికో ఎప్పుడు పోతుందో తెలియదు. ఈ భూమ్మీద ఎన్నాళ్ళుంటామో తెలియదు. ప్రాణం పోయాక వారి ధర్మ మొక్కటే వారితో వస్తుందని తెలియక చెడుమార్గంలో పయనిస్తారు. నీ పదభక్తి తెలిసికొనక శ్రీకాళహస్తీశ్వరా!

**దుష్టుని అభిమానం దుఃఖానికి మూలకారణం**

# సుమతీ శతకము

కవిపరిచయం :

నీతిశతకాల్లో కాలాన్ని బట్టి గుణవిశేషాలను బట్టి అగ్రగణ్యమైంది సుమతి శతకం. ఇందు అన్నీ కందపద్యాలే. క్రీ.శ. 13వ శతాబ్దియందలి బద్దెన అనే భద్రభూపాలుడీ శతకాన్ని రచించారు.

**అక్కరకు రాని చుట్టము**
**మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమున తా**
**నెక్కిన పారని గుఱ్ఱము**
**గ్రక్కున విడువంగవలయు కదరా సుమతీ!**

భా॥ అవసరానికి పనికిరాని బంధువుల్ని, భక్తి శ్రద్ధలతో తాను మ్రొక్కినా అపత్కాలంలో కాపాడని దేవుణ్ణి, తానెక్కినప్పుడు నడవని గుఱ్ఱాన్ని వెంటనే విడిచి పెట్టాలన్నాడు సుమతి శతకకర్త బద్దెన.

**అడిగిన జీతంబియ్యని**
**మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్**
**వడిగల యెద్దుల కట్టుక**
**మడి దున్నుకు బ్రతుకవచ్చు మహిలో సుమతీ!**

భా॥ అడిగినప్పుడు జీతమీయని యజమాన్ని నమ్మి సేవించడం కంటె రెండెద్దులతో పొలం దున్నుకొని బతకడం మంచిది.

**అప్పిచ్చువాడు వైద్యుఁడు**
**ఎప్పుడు నెడతెగక పారునేరును, ద్విజుడున్**
**చొప్పడిన యూర నుండుము**
**చొప్పడకున్నట్టి యూర చొరకుము సుమతీ!**

భా॥ అవసరానికి అప్పు అందించే రుణదాత, వైద్యుడు ఎల్లప్పుడు ప్రవహించేనది, శుభాశుభకార్యాలను జరిపించే బ్రాహ్మణుడున్న గ్రామంలో నివసించాలి. ఇవి లేకుంటే ఆ ప్రదేశాన్ని విడిచి పెట్టాలి.

**ఉత్తమ గుణములు నీచున**
**కెత్తెర గున కలుగనేర్చు నెయ్యెడలం తా**
**నెత్తిచ్చి కరగపోసిన**
**నిత్తడి బంగారుమగునె యిలలో సుమతీ**

భా॥ మంచి గుణాలు నీచునికి అలవడడం చాలాకష్టం. యిత్తడిని తీసుకొని ఎన్నిసార్లు కాచివడ పోసినా బంగారం కాదుగదా!

**ఉపకారికి నుపకారము**
**విపరీతముగాదు సేయ వివరింపంగా**
**అపకారికి ఉపకారము**
**నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!**

భా॥ తనకు సహాయం చేసిన వారికి మేలు చేయడం గొప్పేమికాదు. కాని అపకారం చేసినవాడికి కూడ ఇంతకుముందు వాడుచేసిన కీడును లెక్కచేయక ఉపకారం చేసేవాడే ఉత్తముడు.

**ఎప్పటి కెయ్యది ప్రస్తుత**
**మప్పటి కా మాటలాడి యన్యుల మనముల్**
**నొప్పింపక తా నొవ్వక**
**తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ!**

భా॥ ఏ సమయాన ఏది అవసరమో తెలుసుకొని అప్పటికా మాటలు చెప్పి, ఇతరుల మనస్సు నొప్పింపక, తాను బాధపడక తప్పించుకొని తిరిగేవాడే బుద్ధిమంతుడు.

**ఎప్పుడు సంపద కలిగిన**
**అప్పుడె బంధువులు వత్తురది యెట్లన్నన్**
**తెప్పలుగ చెరువునిండిన**
**కప్పలు పదివేలు చేరు కదరా సుమతీ!**

భా॥ తన దగ్గర ధనం ఉన్నప్పుడు బంధు, మిత్రులు చుట్టుతిరుగుతారు. ఎలాగంటే చెరువునిండా నీళ్ళు నిండగానే వేలకొలది కప్పలు వచ్చి చేరినట్లు

**కనకపు సింహాసనమున**
**శునకము కూర్చుండ పెట్టి శుభలగ్నమున**
**ఒనరగ పట్టముగట్టిన**
**వెనుకటిగుణమేల మాను వినరా సుమతీ!**

భా॥ కుక్కను తీసుకొచ్చి కుందనపు (బంగారు) గద్దెమీద కూర్చుండబెడ్తే దానికి కట్టిన కుచ్చులన్నీ తెగి పోయేట్టు కొరుకుతుంది. కుక్క పుట్టుకతో వచ్చిన గుణాన్ని ఎలా మానదో, అల్పుడైన వానికి ఎంత గౌరవమర్యాదలు చేసినా తన నీచత్వాన్ని విడువలేడు.

**కమలములు నీట పాసిన**
**కమలాప్తుని రశ్మి సోకి కమలినభంగిన్**
**తమ తమ నెలవులు తప్పిన**
**తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ!**

భా॥ సూర్యోదయం కాగానే కమలాలు వికసిస్తాయి. వీటినుండి తీసివేసిన కమలానికి సూర్యరశ్మిసోకితే వాడిపోతుంది. మనుషులు అంతే. వారు వారి స్థానాలు తప్పితే మిత్రులనుకున్నవారే శత్రువులౌతారు.

**కులకాంత తోడ నెప్పుడు**
**కలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ**
**కలకంఠి కంట కన్నీ**
**రొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ!**

భా॥ తన వారిని, తన ఊరిని వదిలి మెట్టినిల్లే సర్వస్వమనుకొని వచ్చిన భార్యతో ఎప్పుడూ కలహమాడ కూడదు. ఆమెకు లేని దోషాన్ని అంటగట్టి ఏడ్పించకూడదు. ఏయింట్లో స్త్రీ కన్నీరు కారుస్తుందో ఆయింట్లో సిరిసింపదలు సుఖసంతోషాలుండవు.

**కూరిమిగల దివములలో**
**నేరము లెన్నడుమ కలుగనేరవు మరి యా**
**కూరిమి విరసంబైనను**
**నేరములే తోచుచుండు నిక్కము సుమతీ!**

భా॥ పరస్పరము స్నేహమున్న రోజుల్లో తప్పులేవి కన్పించవు. ఈ స్నేహం చెడగానే వారి మాటలు, చేతలు అన్నీ తప్పుగానే కనబడుతాయి. నిజమిది.

**కొరగాని కొడుకు పుట్టిన**
**కొరగామియె కాదు తండ్రి గుణముల చెరచున్**
**చెరకు తుద వెన్ను పుట్టిన**
**చెరకున తీపెల్ల చెరచు సిద్ధము సుమతీ!**

భా॥ అప్రయోజకుడైన కొడుకుపుడ్తే వాడు పనికిమాలినవాడవడమే కాక, తండ్రికున్న పేరుప్రతిష్టలు చెడగొడుతాడు. చెరుకుగడ చివర కంకిమొలిస్తే దానిలో తీపిలేక పోవడమే కాక చెరుకుగడలోని తీపినంతటి పోగొడుతుంది.

**చీమలు పెట్టిన పుట్టలు**
**పాముల కిరవైన యట్లు పామరుడు తగన్**
**హేమంబుకూడ పెట్టిన**
**భూమీశులపాల చేరు భువిలో సుమతీ!**

భా॥ చీమలు కష్టపడి పుట్టలు పెడ్తే పాములందులో హాయిగా నివసిస్తాయి. 'పాచిపళ్ళవాడు కూడిబెడ్తే బంగారు పళ్ళవాడునుభవిస్తా'రంటారు. ధనానికి దానం, భోగం, నాశం అనే మూడు గుణాలుంటాయి. అనుభవించనివాడు,చేజేతుల నాశనం చేసుకుంటాడు.

**తన కోపమె తన శత్రువు**
**తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ**
**తన సంతోషమె స్వర్గము**
**తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!**

భా॥ ఎవరి కోపం వారికే అపకారం చేసేశత్రువు. తనకున్న శాంతమే తనకు రక్షణనిస్తుంది. తన దయాగుణమే తనకు చుట్టంలాగ సహాయ పడ్తుంది. ఎవరి ఆనందమే వారికి సుఖాన్నిస్తుంది. వారి దుఃఖమే నరకప్రాయమౌతుందంటారు పెద్దలు.

**తలనుండు విషము ఫణికిని**
**వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్**
**తల తోక యనక యుండును**
**ఖలునకు నిలువెల్ల విషము కదరా సుమతీ!**

భా॥ పాముకు విషం తలలో ఉంటుంది. తేలుకు తోకలోఉంటుంది. కాని దుష్టునికి తలతోక అనే భేదం లేక ఒళ్ళంతా ఉంటుంది.

**పుత్రోత్సాహము తండ్రికి**
**పుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జనులా**
**పుత్రుని కనుగొని పొగడగ**
**పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!**

భా॥ కుమారుడు పుట్టగానే తండ్రికి సంతోషం కలుగదు. తన కొడుకు ప్రయోజకుడని ప్రజలు మెచ్చుకున్న రోజుననే సంతోషం కల్గుతుంది.

**బలవంతుడ నాకేమని**
**పలువురితో నిగ్రహించి పలుకుట మేలా**
**బలవంతమైన సర్పము**
**చలిచీమలచేత చిక్కి చావదె సుమతీ!**

భా॥ నేను చాలా బలవంతుడను నన్నెవ్వరేమి చేయలేరని నిర్లక్ష్యం పనికిరాదు. బలవంతమైన పాము చలి చీమల చేత చిక్కుకొని చనిపోదా!

**మాటకు ప్రాణము సత్యము**
**కోటకు: ప్రాణంబు సుభట కోటి ధరిత్రిన్**
**బోటికి ప్రాణము మానము**
**చీటికి ప్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ!**

భా॥ మాట్లాడే మాటలకు సత్యమే ప్రమాణం. కోటకు చుట్టూ రక్షించే సైన్యం; స్త్రీకి శీలం, పత్రం రాసిస్తే సంతకం ముఖ్యమైన ఆధారాలు.

**వినతగు నెవ్వరు చెప్పిన**
**వినినంతనె వేగపడక వివరింపతగున్**
**కని కల్ల నిజము తెలిపిన**
**మనుజుడే పో నీతిపరుడు మహిలో సుమతీ!**

భా॥ అందరూ చెప్పేదివిని, తన విచక్షణ జ్ఞానంతో నిజానిజాలను తెలుసుకున్నవాడే నీతిమంతుడు.

**సిరి తా వచ్చిన వచ్చును**
**సలలితముగ నారికేళ సలిలము భంగిన్**
**సిరి తా పోయిన పోవును**
**కరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ!**

భా॥ సంపద ఎప్పుడు వస్తుందో, ఎలా పోతుందో ఎవరికి తెలియదు. కొబ్బరికాయలోకి నీళ్ళు వచ్చినట్లు వస్తుంది. ఏనుగు మింగిన వెలగపండులో గుజ్జులా మాయమౌతుంది.

# భాస్కరశతకము

కవిపరిచయం :

సుమతి శతకం లాగానే ఆంధ్రదేశంలో విశేష ప్రచారం పొందిన మరో నీతి శతకం భాస్కర శతకం. మారద వెంకయ్య దీన్ని రచించాడని చెప్తుంటారు. క్రీ.శ. 17వ శతాబ్దికి పూర్వమే రచింపబడింది. ఈ శతక మందలి శైలి సులభంగా, శక్తివంతంగానున్నది. ఇందలి నీతులు - దృష్టాంతాలు చాల హృద్యంగా ఉంటాయి.

**అతి గుణహీనలోభికి పదార్థము కల్గిన లేక యుండినన్**
**మితముగాని కల్మిగల మీదట నైన భుజింప డింపుగా**
**సతమని నమ్మ దేహమును సంపద, ఏరులు నిండి పారినన్**
**గతుకగ చూచుకుక్క తనకట్టడ మీరక యెందు భాస్కరా!**

భా॥ పిసినారి వాడు తనకు సంపద ఉన్నా మితంగానే అనుభవిస్తాడు. నీళ్ళు నిండిపారుతున్న ఏరు దగ్గరకు కుక్క దాహంతో వెళ్ళినా దాని అలవాటు ప్రకారం నాలుకతో గతుకుతుందే తప్ప తనవితీర తాగదు కదా! అలాగే లోభివాడు శరీరం, సంపద శాశ్వతమనుకొని సంపద ఉన్నా సరిగా తినడు, అనుభవించడు.

**ఉరుగుణవంతుడొర్లుదను కొండపకారము చేయువప్పుడున్**
**పరహితమే యొనర్చు నొక పట్టునైనను కీడుచేయగా**
**నెరుగడు నిక్కమేకద యదెట్లన కవ్వము పట్టి యెంతయు**
**తరువగ చొచ్చినన్ పెరుగుతాలిమినీయదె వెన్న భాస్కరా!**

భా॥ గుణవంతుడు తనకు పరులు కీడు చేస్తున్నా, వారికపకారము చేయక తాను పరోపకారమేచేస్తాడు. పెరుగును కవ్వంతో ఎంత చిలికినా ఓర్చి వెన్ననే యిస్తుంది.

**ఎడపక దుర్జనుండొరుల కెంతయు కీడొనరించును కానియే**
**యెడలను మేలు చేయడొక యించుకయైనను; చీడపుర్గు తా**
**చెడతిను నింతెకాక పుడిసెండు జలంబిడి పెంచనేర్చునే**
**పొడవగు చున్న పుష్పఫలభూరుహ మొక్కటినైన భాస్కరా**

భా॥ దుర్మార్గుడు అందరికి హాని చేస్తాడే కాని మేలు చేయడు. చీడపురుగు చక్కగా పెరుగుతున్న చెట్లు పువ్వులు కాయలు తింటుంది. కాని పుడిసెడు (దోసెడు) నీళ్ళు పోసి పెంచలేదు కదా!

**ఎడ్డెమనుష్యుడే మెరుగు నెన్ని దినంబులు కూడి యుండినన్**
**దొడ్డగుణాఢ్యునందుగల తోరపు వర్తన లెల్ల ప్రజ్ఞ బే**
**ర్పడ్డ వివేకరీతి; రుచిపాకము నాలుక కాకెరుంగనే?**
**తెడ్డది కూరలో కలయ త్రిమ్మరు చుండిననైన భాస్కరా!**

భా॥ కూరరుచి నాలుకకు తెలుస్తుంది. కాని దాన్ని కలియబెట్టిన గరిటెకు తెలుస్తుందా? అట్లే గుణవంతుని గుణాలు గుణవంతునికే తెలియునుకాని ఎన్నిరోజులు కలిసితిరిగినా మూఢునికి తెలియవు.

**చదువది యెంతకల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా**
**చదువు నిరర్థకంబు గుణసంయుతులెవ్వరు మెచ్చరెచ్చటం**
**పదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం**
**పొదవెడు నుప్పులేక రుచి పుట్టగ నేర్చునటయ్య భాస్కరా!**

భా॥ ఎంతటి విద్వాంసుడైనను కొంచెమైన రసము గ్రహింపకుంటే అతని విద్య వ్యర్థమే. గుణవంతులెవ్వరూ అతణ్ణి మెచ్చుకోరు. నలభీమ పాకం లాంటి వంట చేసినా తగిన ఉప్పు వేయక పోతే రుచించదుకదా!

**దక్షుడు లేని యింటికి పదార్థము వేరొక చోటనుండి వే**
**లక్షలు వచ్చుచుండిన పలాయనమైచను కల్లకాదు ప్ర**
**త్యక్షము వాగులున్ వరదలన్నియు వచ్చిన నీరు నిల్చునే**
**అక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా!**

భా॥ కుటుంబ బాధ్యత వహించే యజమాని లేకుంటే, యింటికి వచ్చిన ద్రవ్యం లక్షలు వచ్చినా నిలువదు. ఎలాగంటే గండిపడిన చెరువులోకి ఎంత నీరు వచ్చినా హద్దు లేకపోవడంతో కొట్టుకు పోతుంది.

**దానము చేయకోరిన వదాన్యు కీయగ శక్తి లేనిచో**
**నైన పరోపకారమునకై యొకదిక్కున తెచ్చియైన నీ**
**పూనుమ మేఘుడంబుధికి పోయి జలంబుల తెచ్చి యీయడే**
**వాన సమస్త జీవులకు వాంఛిత మింపెసలార భాస్కరా!**

భా॥ దాతృత్వం అనేగుణం ఉండాలేకాని తన దగ్గర లేకున్నా యితరుల నడిగైనా పరోపకారం చేస్తాడు. మేఘాలు తన దగ్గర నీరు లేకున్నా సముద్రాన్నుండి జలాన్ని గ్రహించి వాన రూపంలో సమస్త జీవులకందించవా!

**సిరిగలవాని కెయ్యెడల చేసిన మేలది నిష్ఫలంబగున్**
**నెరిగురిరాదు పేదలకు నేర్పున చేసిన సత్ఫలంబగున్**
**పరువున వచ్చి మేఘుడొక వర్షము వాడిన చేల మీదటం**
**కురిసిన గాక యంబుధుల కుర్వగ నేమి ఫలంబు భాస్కరా!**

భా॥ మేఘాలు వానలు లేక ఎండిపోతున్న పొలాలమీద వర్షిస్తే లాభముంటుంది. కాని, సముద్రంలో వర్షిస్తే ఏంలాభం? అలాగే బీదవాడికి దానం చేస్తే తలుచుకుంటాడు కాని భాగ్యవంతుడికిస్తే లాభముండదు గుర్తు పెట్టుకోడు.

# భర్తృహరి సుభాషితములు

(తెలుగు అనువాదం - ఏనుగులక్ష్మణ కవి)

కవిపరిచయం :

సంస్కృతంలో బహుళ ప్రచారం పొందిన భర్తృహరి సుభాషితాలను తిమ్మనార్యుని పుత్రుడైన ఏనుగులక్ష్మణకవి తెలుగులోకి అనువదించారు. రాజైన భర్తృహరి తన రాజ్యంపై, భార్యపై విరక్తుడై అడవికి వెళ్ళిపోయాడని జనులు చెప్పుకుంటారు. ఇతడు నీతి - శృంగార వైరాగ్యాలను 300 పద్యాల్లో వర్ణించాడు. ఇతనికి గల లోకజ్ఞత అసమానమైంది. నీతి శతకంలో - మూర్ఖపద్ధతి, విద్వత్పద్ధతి, అర్థపద్ధతి, దుర్జన పద్ధతి - సుజన పద్ధతి, పరోపకారపద్ధతి, ధైర్యపద్ధతి ఇలా చాలా వివరించాడు.

శృంగారశతకంలో - స్త్రీలవర్ణన, సంభోగవర్ణన కామినీవర్ణన, సువిరక్త, దుర్విరక్త ..... ఇలా అనేక వర్ణనలు పొందుపర్చాడు.

వైరాగ్య శతకంలో - తృష్ణాదూషణం, విషయపరిత్యాగం, కాలమహిమ..... ఇలా అనేక విషయాలు చర్చించాడు.

ఆరంభించరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతురురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్న నిహన్య మానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్

భా॥ ఆటంకాలు కల్గుతాయని శ్రమకు భయపడి అధములు ఏ పనిమొదలు పెట్టరు. పని మొదలయ్యాక ఏవైనా విఘ్నాలు వస్తే ఆ పనిని వదిలేస్తారు. మధ్యములు. ఉత్తములు (బుద్ధిమంతులు) ఎన్ని అడ్డంకులొచ్చినా, తాము మొదలు పెట్టిన పనిని ధైర్యోత్సాహాలతో పూర్తి చేస్తారు. కాని వదలి పెట్టరు.

**తెలివి యొకింత లేని యెడ తృప్తుడనై కరిభంగి సర్వమున్**
**తెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితి తొల్లి యిప్పుడు**
**జ్ఞుల మతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై**
**తెలియని వాడనై మెలగితిం గతమయ్యె నితాంత గర్వమున్**

భా॥ కొంచెం కూడ జ్ఞానం లేని రోజుల్లో మదించిన ఏనుగులా అన్నీ నాకే తెలుసని గర్వించాను. ఇప్పుడు మహావిద్వాంసుల చెంత చేరి వారి పాండిత్యానికి ఆశ్చర్యపడి, అప్పుడు తెలుసుకున్నాను. నాకేమి తెలియదని. నాకున్న గర్వమంతా తొలిగిపోయింది.

**భూషలు కావు మర్త్యులకు భూరి మయాంగద తారహారముల్**
**భూషితకేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్**
**భూషలుగావు పూరుషుని, భూషిత చేయు పవిత్రవాణి వా**
**గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశించు నన్నియున్**

భా॥ మనుషులకు భుజకీర్తులు, హారములు గాని, చందనం పూసుకోవడం పూలదండలు పెట్టుకోవడం, అత్తరునూనెలతో తలదువ్వుకోవడం అనేవేవి అలంకారానియ్యవు. శాస్త్ర సంస్కారం గలవాక్కు ఒక్కటే అలంకారం. వాగ్భూషణమే నశించని భూషణం.

**తివిరి యిసుమను తైలంబు తీయవచ్చు**
**తవిలి మృగతృష్ణలో నీరు త్రాగవచ్చు**
**తిరిగి కుందేటి కొమ్ము సాధించవచ్చు**
**చేరి మూర్ఖుల మనసు రజింపరాదు.**

భా॥ ఇసుకను పిండైనా సరే అతికష్టమ్మీద దానిలోంచి నూనె తీయవచ్చు ఎండమావుల్లోంచి నీళ్ళైనా తాగవచ్చు? కావాలనుకంటే లోకమంతా తిరిగి ఎక్కడైనా కుందేటి కొమ్ము సాధించవచ్చు - కాని మూర్ఖుని మనసు సంతోష పెట్టడం చాలకష్టం.

**జలమున నగ్ని, ఛత్రమున చండమయూఖుని దండతాడనం**
**బుల వృషగర్దంబులను పొల్పగు మత్త కరీంద్రమున్ సృణిం**
**చెలగెడు రోగ మౌషధముచే, విషముందగు మంత్రయుక్తి ని**
**మ్ముల తగ చక్కచేయనగు మూర్ఖుని మూర్ఖత మాన్పవచ్చునే**

భా॥ అగ్ని చేత యిళ్ళు వస్తువులు దగ్ధమౌతుంటే ఆ మంటలను నీటితో చల్లార్పవచ్చు. ఎండ వేడిన తట్టుకోవడానికి గొడుగుపట్టుకుంటే సరిపోతుంది. ఎద్దును, గాడిదను గట్టికర్ర దెబ్బలచేత, మదించిన ఏనుగును అంకుశం చేత, పాము, తేలు కుట్టి విషమెక్కితే మంత్రం చేత చక్కగా చేయవచ్చు. కాని మూర్ఖుని మూర్ఖత్వాన్ని మాన్పడానికి ఏ మార్గం లేదు.

**విద్యవిగూఢగుప్తమగు విత్తము రూపము పురుషాళికిన్**
**విద్యయశస్సు భోగకరి విద్యగురుండు విదేశబంధుడున్**
**విద్య విశిష్టదైవతము విద్యకు పాటి ధనంబు లేదిలన్**
**విద్య నృపాలపూజితము విద్య నెరుంగని వాడు మర్త్యుడే**

భా॥ మనిషికి విద్య ఎవరికి కన్పించకుండా దాగి ఉన్నధనం. అది కీర్తిని, సుఖాన్నిస్తుంది. గురువులాగ ఆలోచన లందిస్తుంది. వేరే ప్రాంతానికి వెళ్ళినపుడు చుట్టం వలె ఆదుకుంటుంది. విద్య పవిత్ర మైన, విశిష్టమైన దేముడివంటిది. విద్యతో సరితూచగల ధనం భూమ్మీద ఏదీ లేదు. రాజు చేత పూజింపబడేది. అవసరానికి ఆదుకునేది అలాంటి విద్యను నేర్చుకోని వాడు మనుష్యుడేనా?

**సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్పు**
**గౌరవ మొసంగు జనులకు కలుషమడుచు**
**కీర్తి ప్రకటించు చిత్త విస్ఫూర్తి జేయు**
**సాధుసంగంబు సకలార్థ సాధనంబు**

భా॥ సజ్జనులతో సాంగత్యం చేయడం అన్ని విధాల మంచిది. సత్యవంతుడుగా చేస్తుంది. బుద్ధిబలాన్ని చేకూరుస్తుంది. గౌరవాన్నిస్తుంది. మనలోని లోపాలను పోగొడుతుంది. కీర్తి కలిగిస్తుంది. ఆలోచనలను రేకెత్తింపజేస్తుంది. ఒకటేమిటి అనేక విధాలైన సుగుణాలను సంపాదించే సాధనం సత్ సాంగత్యం.

**వనజంభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబో కొంచెమో**
**విను మరుభూమి కేగిన లభించును మేరువు చేరబోయినన్**
**ధనమధికంబురాదు కడుదైన్యము మానుధనాఢ్యులందు వ**
**వ్వననిధి సూతతుల్యముగ వాత గ్రహించుట చూడుమా**

భా॥ బ్రహ్మదేవుడు వ్రాసిన తల రాతను బట్టి కొద్దో గొప్పో ఐశ్వర్యాన్ని అనుభవిస్తాం ప్రాప్తం ఉంటే శ్మశానం దగ్గరైనా దొరుకుతుంది. మేరు పర్వతం దగ్గరికి వెళ్ళినా ప్రాప్తం లేకుంటే దొరకదు. దానికై దీనత్వం పొందకూడదు. సముద్రంలో నీళ్ళు చాలా ఉన్నా చెంబుపట్టుకెళ్ళితే, ఆ చెంబెడే తెచ్చుకుంటాం కాని సముద్రమంతా తేలేం కదా!

**ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందు తాల్మియున్**
**భూప సభాంతరాళమున పుష్కల వాక్చతురత్వ మాజీలూ**
**హోపటుశక్తియున్ యశమునందనురక్తియు విద్యయందు వాం**
**ఛా పరివృద్ధియున్ ప్రకృతి సిద్ధ గుణంబులు సజ్జనాళికిన్.**

భా॥ ఆపద వచ్చినప్పుడు ధైర్యాన్ని, ఐశ్వర్యము వచ్చినపుడు ఓర్పును, సభయందు చక్కటి వాక్చాతుర్యాన్ని, యుద్ధమందు శౌర్యాన్ని చూపడం కీర్తి యందాసక్తి కలిగియుండడం విద్యాభ్యాసం చేయాలనే నిరంతర ఆలోచన ఇవి సజ్జనులకు స్వభావగుణాలు.

**కరమున నిత్య దానము, ముఖంబున సూనృతవాణి, ఔదలం**
**గురుచరణాభివాదన మకుంఠిత వీర్యము దోర్యుగంబునన్**
**వర హృదయంబునన్ విశదవర్తన మంచిత విద్య వీనులన్**
**సురుచిర భూషణంబులివి శూరులకున్ సిరిలేని యప్పుడున్**

భా॥ మహాత్ములకు ఐశ్వర్యం లేదా, బంగారు నగలు లేక పోయినా ఈ పై చెప్పినవి స్వాభావికాలంకారాలు. ఎలానంటే ప్రతిదినం లేనివారికి దానంచేయడం, సత్యం మాట్లాడటం, శిరస్సుతో గురుపాద నమస్కారం, ముఖానికి సత్యవచనం భుజాలకు మొక్కవోని పరాక్రమం హృదయానికి అకళంకమైన ప్రవర్తన, చెవులకు శాస్త్ర శ్రవణం అలంకారాలు.

**ధరఖర్వాటు డొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుడై**
**త్వర తోడన్ పరుగెత్తి చేరి నిలచె తాళద్రుమచ్ఛాయ త**
**చ్ఛిరముం తత్ఫలపాత వేగమున విచ్చెన్ శబ్దయోగంబుగా**
**బోరి దైవోపహతుండు పోవు కడకున్ పోవున్ గదా ఆపదల్**

భా॥ బట్టతలవాడొకడు సూర్యకిరణాల వేడి తట్టుకోలేక వేగంగా పరిగెత్తి ఓ తాడి చెట్టునీడన నిలబడ్డాడు. అదే క్షణంలో కాకతాళీయంగా ఒక తాటి పండు వచ్చి వాడి తలమీద పడి తల బద్దలయింది. కనుక దౌర్భాగ్యుడెక్కడికి పోతే ఆపదలు వాడి వెంటనే ఉంటాయి.

**తరువు లతిరసఫలభార గురుతగాంచు**
**నింగి వ్రేలును అమృత మొసంగు మేలు**
**దుద్ధతులు కోరు బుధులు సమృద్ధి చేత**
**జగతినుపకర్తలకునిది సహజ గుణము**

భా॥ జగత్తులో ఉపకార గుణం కలిగిన వారు ఫలాపేక్ష లేకనే పనులు చేస్తారు. అది వారి సహజగుణం. చెట్లు తియ్యని ఫలాలను మోసి మనకందిస్తాయి. చంద్రుడు చల్లదనాన్ని ఆహ్లాదాన్నిచ్చే వెన్నెల కాయిస్తాడు. లోక శ్రేయస్సే కోరుతారు తప్ప బుద్ధిమంతులు మరేమీ ఆశించరు.

**హరినామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁడైనట్టి స**
**త్పురుషశ్రేష్ఠుఁడసత్కథాలవణవాఃపూరంబుఁదాఁగ్రోలునే**
**వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స**
**త్వరమై పోవునె చేదువేములకు దుర్గంధానుమోదాత్మమై"**

దివ్యమైన విష్ణునామచిహ్నములుగల మంచి కథలనే అమృతాన్ని గ్రోలిన సత్పురుషుడు అనుచితకథలనే ఉప్పునీటిని రుచిచూస్తాడా? మందార పుష్పాల తేనె నాస్వాదించే తుమ్మెద చేదువేపల చెంతకు చేరుతుందా? (చేరదు.)

# వేమన శతకము

కవిపరిచయం :

శతకాలే ఉద్దేశంతో రచింపబడ్డా అక్కడక్కడ కొన్ని నీతులు చెప్పబడ్డూనే ఉంటాయి. ప్రసిద్ధుడైన వేమన రచించిన "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటంతో పద్యాల్లో చాలా నీతి ప్రధానమైనవే. వేమన పద్యాలన్నీ ఆట వెలదులే. లోకజ్ఞత గల ప్రజాకవి ప్రతివిషయాన్ని విడమర్చి సులభశైలిలో వివరించాడు. వేమన తర్వాత చాలా కాలానికి ప్రజల నాలుకల మీదనున్న వేమన పద్యాలను బ్రౌను దొర సేకరించి, పరిష్కరించి, ముద్రించారు.

**చిత్త శుద్ధి కలిగి చేసిన పుణ్యంబు**
**కొంచెమైన నదియు కొదువ కాదు**
**విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ భక్తి శ్రద్ధలతో ఏ పుణ్యకార్యం చేసినా కొంచెమైనా గొప్పదే ఔతుంది. అంతపెద్ద మఱ్ఱివృక్షం చిన్న విత్తనం నుండి పుట్టడం లేదా!

**ఆత్మశుద్ధిలేని యాచారమదియేల?**
**భాండశుద్ధిలేని పాకమేల**
**చిత్తశుద్ధిలేని శివపూజలేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ ప్రాచీన కాలంనుండి ఆచారంగా వచ్చే ఏ పనినైనా అంతఃకరణ శుద్ధితో ఆచరించాలి. శుద్ధిలేని ఆచారం వ్యర్థం. వంట చేసేప్పుడు పాత్ర శుభ్రంగా

ఉందా! లేదా! చూసుకోవాలి. స్నానాదులు, జపాదులు పైకి కన్పించే ఆర్భాటాలు కాక, తనలోని కామక్రోధాదులు లేకుండా ప్రశాంతంగా ఉండగలగాలి మనసులో మాలిన్యముంచుకొని, పైకి ఆడంబరంగా శివపూజ చేసినా ఫలితముండదు.

**గంగిగోవుపాలు గరిటెడైనను చాలు**
**కడవడైన నేమి ఖరముపాలు**
**భక్తి గలుగు కూడు పట్టెడైనను చాలు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ మేలు జాతి ఆవుపాలు గరిటెడు తాగినా ఆరోగ్యాన్నిస్తాయి. గాడిదపాలు కుండెడైనా వ్యర్థమే. భక్తితో పట్టెడు అన్నం పెట్టినా తినేవాడు పరమాన్నం అనుకుంటాడు. ~~ఈ~~సడించుకుంటూ పెట్టిన అన్నం తినేవానికి తృప్తి నివ్వదు. నేను పెడ్తున్నాననే అహంకారంతో కాక భగవత్ప్రీతికి పెడ్తున్నాననే భక్తి భావంతో పెట్టాలి.

**మేడిపండు చూడ మేలిమై యుండును**
**పొట్టవిచ్చి చూడ: పురుగు లుండు**
**పిరికివాని మదిని బింక మీ లాగురా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ మేడిపండు పైకి అందంగా సువాసన భరితంగా కన్పిస్తుంది. కాని ఒలిచి తినాలంటే పురుగులుంటాయి. అదే విధంగా పిరికివాడు పైకి గంభీరంగా కన్పించినా, ఏదైనా అవసరవచ్చినపుడు ధైర్యం లేక (ఉత్తర కుమారునిలా) నగుబాటు పాలవుతాడు.

**అల్పుడెప్పుడు పల్కు నాడంబరముగాను**
**సజ్జనుండు పలుకు చల్లగాను**
**కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ తక్కువ తెలివిగలవాడు లేని పోని గొప్పలు చెప్తూ, ఎక్కువ మాట్లాడుతుంటాడు. బుద్ధి మంతుడు తన గొప్పతనాన్ని ప్రకటించక మధురంగా తక్కువగా మాట్లాడుతాడు. వెలతక్కువైన కంచు పెద్దగా మ్రోగడం, ధర ఎక్కువగా నున్న బంగారం తక్కువగా మ్రోగడం చూస్తుంటాంకదా!

**కులములోన నొకడు గుణవంతుడుండిన**
**కులము వెలయు వాని గుణము వలన**
**వెలయ వనములోన మలయజంబున్నట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ అడవిలో ఒక్క గంధపు చెట్టున్నా అడివంతా సువాసనతో నిండి పోతుంది. అలాగే కులంలో ఒక్క గుణవంతుడు పుడ్తే ఆ వంశమంతా కీర్తి ప్రతిష్టలు కలిగుంటుంది.

**కులములోన నొకడు గుణహీనుడుండెనా**
**కులముచెడును వాని గుణము వలన**
**వెలయు చెఱకునందు వెన్నువెడలినట్లు**
**విశ్వదాభిరామ వినుర వేమ**

భా॥ కులంలో ఒక గుణహీనుడు పుడ్తే వాని దుర్మార్గ ప్రవర్తనతో ఆ వంశ గౌరవం పాడవుతుంది. తీయని చెరుకుగడ చివర వెన్ను పుట్టి దాని మాధుర్యాన్నంతా పాగొట్టినట్టు.

**వేరుపురుగు చేరి వృక్షంబు చెరచును**
**చీడ పురుగు చేరి చెట్టు జరచు:**
**కుత్సితుండు చేరి గుణవంతుచెరచురా**
**విశ్వదాభిరామ వినురవేమ!**

భా॥ వేరుతొలిచే పురుగు చేరి చెట్టు మూలాన్నే తిని నాశనం చేస్తుంది. ఆకులు తినే చీడపురుగుపట్టి మొక్క పైభాగాన్ని పాడుచేస్తుంది. అలాగే దుర్బుద్ధి కలిగినవాడు చేరి గుణవంతుణ్ణి పాడుచేస్తాడు.

**అల్పబుద్ధి వాని కధికారమిచ్చిన**
**దొడ్డవారి నెల్లఁ దొలగ చేయు:**
**చెప్పు తినెడి కుక్క చెరకు తీపెరుగునా**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

భా॥ అల్పమైన బుద్ధికలిగిన వాడికి అధికారమిస్తే ఉన్నతాధికారులందరిని తీసివేస్తుంటాడు. వారిగొప్పతనాన్ని గుర్తించలేడు. చెప్పులు తినేకుక్కకు చెరుకు గడ అందిస్తే దానిరుచి, రసంలోని మాధుర్యం గ్రహించలేదు.

**ఎలుకతోలు తెచ్చి యేడాది యుతికిన**
**నలుపు నలుపెగాని తెలుపురాదు**
**కొయ్యబొమ్మను తెచ్చి కొట్టిన పలుకునా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ ఎలుకతోలు తెచ్చి ఎన్ని రోజులుతికినా నల్లగనే ఉంటుంది. కాని తెల్లపడదు. చెక్క బొమ్మను ఎంతకొట్టినా పలుకదా కదా!

**గొడ్డుటావు పితుక కుండ గొంపోయిన**
**పండ్లు రాల తన్ను పాల నీదు**
**లోభి వాని నడుగ లాభంబులేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ పాలులేని ఆవు దగ్గరకు వెళ్ళి పాలుపితకాలని కూర్చుంటే పాలియ్యదు సరికదా! పళ్ళురాలేట్టు తన్నుతుంది. అలాగే పిసినారి వద్దకు వెళ్ళి డబ్బడిగితే లాభం లేదు.

**అన్ని దానములను నన్నదానమె గొప్ప**
**కన్న తల్లికంటె ఘనము లేదు**
**ఎన్న గురుని కన్న నెక్కుడు లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ దానాలన్నిటిలో అన్నదానం చాలా గొప్పదంటారు. ఆకలితో అలమటిస్తున్న వారికి పట్టెడన్నంపెడ్తే ప్రాణదానం చేసినట్లే అలాగే ఆత్మబంధువులందరిలోకి తల్లి గొప్పది. నవమాసాలు మోసి ఈ భూమ్మీదికి తనను తెచ్చినతల్లిని తొలిదైవంగా భావించాలి.

**తప్పు లెన్నువారు తండోపతండంబు**
**లుర్విజనులకెల్ల నుండు తప్పు**
**తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ ఎదుటివారిలోని తప్పులెన్నేవారు చాలామంది. కాని ప్రతివారిలో తప్పులుంటాయి. ఎదుటివారిలోని తప్పులెన్నే వారు తమ తప్పులు గురివింద గింజలా గుర్తెగరు.

**అనగ ననగ రాగమతిశయిల్లుచు నుండు**
**తినగతినగ వేము తీయగుండు**
**సాధనమున పనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ పాడగా పాడగా రాగం బాగా వస్తుంది. వేపచిగుళ్ళు తింటే మొదట్లో చేదుగా ఉంటాయి కాని రోజూ కొంచెం తింటూంటే అలావాటై తియ్యగా మార్తాయి. ఏ పనైనా మొదట్లో కష్టంగాతోచినా సాధన చేయడం ద్వారా సులభమౌతుంది.

**ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు**
**కాల్చి యతుక వచ్చు క్రమముగాను**
**మనసు విరిగెనేని మరి కూర్పవచ్చునా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ లోహాలన్నింటిలో గట్టిదైన ఇనుము విరిగితే రెండు సార్లైనా, మూడుసార్లైనా అతికి సరిచేయవచ్చు కాని, మనసు విరిగితే (గాయపడి విరక్తి కలిగితే) అతకడం (అనురక్తి కల్గించడం) చాలాకష్టం.

**చంపతగిన యట్టి శత్రువు తనచేత**
**చిక్కెనేని గీడు సేయరాదు**
**పొసగ మేలు చేసి పొమ్మనుటేచాలు**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ తనకు మహాపకారం చేసిన శత్రువు ఎప్పుడైనా చేతికి చిక్కితే చంపాలనిపిస్తుంది. కాని వానికి హాని చేయడం మంచివారి లక్షణంకాదు. వాడికి చేతనైన సహాయం చేసి పొమ్మంటే చాలు. అది ఉత్తమలక్షణం. శత్రువు తన తప్పు తెలుసుకొని మనసుమారి మంచి వాడయే అవకాశం ఉంది. దొరికాడు కదా అని కీడు చేస్తే ఇద్దరి మధ్య పగ పెరుగుతుంది కాని మార్పురాదు.

**విత్తముగలవాని వీపునపుండైన**
**వసుధలోన చాల వార్తకెక్కు**
**పేదవానియింట పెండ్లైన నెరుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ ధనవంతుని వీపున చిన్నకురుపైనా వార్తగా వ్యాపిస్తుంది. పేదవానింట్లో పెండ్లైనా సరే ఎవరూ పట్టించుకోరు. ఇదిలోక సహజం.

**చెప్పులోన రాయి, చెవిలోన జోరీగ,**
**కంటిలోని నలుసు, కాలి ముల్లు**
**ఇంటిలోని పోరు నింతంత కాదయా**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ చెప్పులో దూరిన రాయి; చెవిదగ్గర రొద చేసే జోరీగ, కంటిలో పడ్డ నలుసు కాలిలో గుచ్చుకున్నముల్లు, ఇంటిలో గయ్యాళిభార్య రోజు పెట్టే పోరు వీటితో కలిగే బాధ యింత, అంతయని చెప్పలేం. అనుభవించిన వానికే తెలుస్తుంది.

**తల్లిదండ్రుల పయి దయలేని పుత్రుండు**
**పుట్టనేమి? వాడు గిట్టనేమి?**
**పుట్టలోని చెదలు పుటదా గిట్టదా?**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ తల్లిదండ్రుల మీద ప్రేమ అనురాగం లేని పిల్లలు పుట్టినా ప్రయోజనంలేదు. పుట్టలోని చెదలు పుడ్తుంది, చస్తుంది. దాని వలన ఎవరికి ప్రయోజనం లేదు.

**అంతరంగమందు నపరాధములు చేసి**
**మంచి వానివలెనె మనుజు డుండు**
**ఇతరులరుగకున్న నీశ్వరుడెరుగడా?**
**విశ్వదాభిరామ వినురవేమ**

భా॥ మనిషి తన మనస్సులో ఎన్నో దురాలోచనలు చేస్తూ ఎవరికి తెలియకుండా తెలివిగా తప్పించుకుంటాడు. సమాజంలో పెద్దమనిషిలా చలామణౌతుంటాడు. ఇతరులు తెలుసుకోకున్నా సర్వాంతర్యామి భగవంతుడు తెలుసుకోకుండా ఉంటాడా! తగిన శిక్ష వేయడా! (పిల్లి తన్నెవరూ చూడ్డం లేదని కళ్ళు మూసుకొని పాలుతాగినట్లు)

మనోదౌర్బల్యమే మనిషి పతనానికి మూలం

# కవి చౌడప్ప శతకం

కవిపరిచయం :

చౌడప్పకవి కుందవరం కరణం. ఇతని శతక పద్యాలు పండిత పామరలోకంలో బహుళ ప్రచారం పొందాయి. చౌడప్ప ప్రాచీన కవితారీతుల్లో సుపరిచితుడు. తిక్కన, పెద్దన లితని అభిమానకవులు. తిక్కన వలె కందపద్యాలంటే యిష్టం. కందపద్యరచనలో తిక్కన సిద్ధహస్తుడనియు, ఆ తరువాత అట్టి ప్రశస్తి తనకే లభించిందని ప్రశంసాపూర్వకంగా చెప్పడంతో కందపద్యరచనలో చౌడప్పకు గల ప్రావీణ్యం స్పష్టమౌతుంది. సమకాలిక శతకకర్తల వలె చౌడప్ప కూడ నాటి వ్యవస్థనే కవితావస్తువుగా తీసుకున్నాడు. నీతుల నుపదేశించాడు. సజ్జన-దుర్జన పద్ధతులను తెలియజేసాడు. అనేకాంశాలను వ్యక్తీకరించడంవల్ల చౌడప్పకు గల లోకజ్ఞత రసికతాదృష్టి పరిశీలింపదగ్గది.

పెద్దనవలె కృతి చెప్పిన
పెద్దనవలె, నల్పకవిని పెద్దనవలెనా?
ఎద్దనవలె మొద్దనవలె
గద్దనవలె కుందవరపు కవి చౌడప్పా!

భా॥ అల్లసాని పెద్దన లాగ పద్యం చెప్ప గలిగిన వాణ్ణే పెద్దన అనాలి కాని అల్ప కవులను కాదు. అతనే కవి వృషభుడు. మిగతావారు మొద్దులు, గద్దలు.

తనయునికిని పరదేశికి
పెనిమిటికిని వొక్కరీతి విం దిడియెడు వా
వనితను పుణ్యాంగన యని
ఘనులందురు కుందవరపు కవి చౌడప్పా!

భా॥ భోజనం దగ్గర పంక్తిలో ఫలభేదం చేయగూడ దంటారు తనకొడుక్కు, అతిథికి, భర్తకు ఒకే విధంగా వడ్డించే వనితను పుణ్యాత్మురాలంటారు.

**పులివాకి విడుచుదైవము**
**కలవాటికి, దైవబలము కలుగని వేళం**
**కలహించి గొ్రె కరచును**
**కలియుగమున కుందవరపు కవి చౌడప్పా!**

భా॥ దైవకృప ఉంటే పులివాత పడ్డా నాలుకతో నాకి విడిచిపెడ్తుంది. దైవబలం సరిగా లేనప్పుడు గొ్రె కూడ కరుస్తుందట. (పచ్చికట్టె పామైకరచినట్లు)

**వానలు పస పైరులకును;**
**సానలు పస వజ్రములకు; సమరంబులకున్**
**సేవలు పస; మృగజాతికి**
**కానలు పస; కుందవరపు కవి చౌడప్పా!**

భా॥ పైరు పంటలకు వానలు బలం; వజ్రానికి సానపెడ్తే విలువ, యుద్ధానికి సైన్యం బలం; మృగాలకు అడవి బలమంటారు. కవిచౌడప్పా!

**తులసీదళముల హరిపద**
**జలజంబులు పూజసేయు సరసుల యమదూ**
**తలుచూచి యేమిసేయం**
**గలరప్పా కుందవరపు కవి చౌడప్పా!**

భా॥ తులసీ దళాలతో హరిని పూజించి, అతని పాద పద్మాలను కడిగిన జలాన్ని ఎవరు తీర్థంలా సేవిస్తారో ఆభక్తుని దగ్గరకు రావడానికి యముడుకూడ భయపడ్తాడు.

**ముంతెడు చమురున హరి క**
**త్యంత మనస్సిద్ధి దీప మమదిన మిడువా**
**డంతమున జేరులక్ష్మి**
**కాంతుని పురి కుందవరపు కవి చౌడప్పా!**

భా॥ ముంతెడు నూనెను ప్రమిదలో పోసి ఎవరు మనసిద్ధి కొరకఖండ దీపం వెలిగిస్తారో వారింట్లో లక్ష్మి తాండవమాడుతుంది.

**అంభోజాక్షుల లోపల**
**రంభే కడుచక్కనిది రాగంబులలో**
**గాంభీర్యమైన రాగము**
**కాంభోజే కుందవరపు కవి చౌడప్పా!**

భా॥ స్త్రీలందరిలో రంభే కడు చక్కనిది. రాగాల్లో కాంభోజిరాగమే గంభీరమైంది.

**దొరగావలె ధర్మాత్ముడు**
**సిరిగావలె ప్రజకు పేరు సీమల నెరుగం**
**గురి కావలె కులపతి సి**
**గ్గరికావలె కుందవరపు కవిచౌడప్పా!**

భా॥ ధర్మాత్ముడు దొరలాగా ఉండాలి; ప్రజను చక్కగా చూడాలంటే కోశం నిండుగా ఉండాలి. పరదేశానికి వెళ్ళాలి అంటే చక్కటి అవగాహన ఉండాలి. కులపతిగా గుర్తించాలంటే మితభాషిణికావాలి.

# గువ్వల చెన్న శతకం

కవిపరిచయం :

వేమన, చౌడప్ప శతకాల ధోరణిలో రచింపబడిన శతకాల్లో గువ్వలచెన్న శతకమొకటి. ఈ శతక కర్తృత్వం వివాదాస్పదంగా ఉంది. శతకాలపై పరిశీలన చేసిన శ్రీ వంగూరి సుబ్బారావుగారీ శతకాన్ని పట్టాభిరామకవి రచించారన్నారు గువ్వల చెన్నడే శతకకర్త అని మరికొందరి వాదన.

ఈ శతక పద్యాలు నూటికి మించి ఉన్నాయి. వీటిలో అన్నీ కంధపద్యాలే. చౌడప్ప, వేమనల ననుకరించిన గువ్వలచెన్న శతకకర్త కూడ సమకాలీన వ్యవస్థను సమీక్షించి రాజకీయ, మత, సాంఘిక, ఆచారవ్యవహారాలను విమర్శించాడు. గువ్వల చెన్నడికి లోకజ్ఞత బహుముఖంగా ఉంది.

ఎంతటి విద్యల నేర్చిన
సంతసముగ వస్తు తతులు సంపాదింపన్
చింతించ చూడ నన్నియు
గొంతుక తడుపుకొనుకొరకె గువ్వల చెన్నా!

భా॥ కోటి విద్యలు కూటి కొరకే. ఎన్ని వస్తువులు సంపాదించుకున్నా, ఏపని చేస్తున్నా మూల సూత్రం తిండికొరకే.

వెలకాంత లెంద రైనను
కులకాంతకు పాటిరారు కువలయ మందున్
పలు విద్య లెన్ని నేర్చిన
కుల విద్యకు సాటి రావు గువ్వల చెన్నా!

భా॥ వేశ్యలెంతమంది ఉన్నా, తన భార్యతో సమానంకారు. అలాగే ఎన్ని విద్యలు నేర్చినా కుల విద్యకు సాటిరాదు.

**కలిమిగలవాడె మనుజుడు**
**విలసిత తత్ కీర్తిచేత మెలయగ వలెరా**
**కలిమేల యెల్లకాలము**
**కులగిరులా కదలకుండ గువ్వల చెన్నా!**

భా॥ డబ్బున్న వాడికీ సంఘంలో కీర్తి. కాని ఆ సిరి కూర్చొని తింటే కొండంతైనా సరే కరిగిపోతుంది.

**కలిమిగల లోభి కన్నను**
**విలసితమగు పేద మేలు వితరణియైనన్**
**చలి చెలమ మేలుకాదా**
**కులనిధి యంభోధి కన్న గువ్వల చెన్నా!**

భా॥ డబ్బున్న పిసినారి కంటె, ధనం లేని పేదవారు నయం. పెద్దసముద్రం కంటె తియ్యని నీళ్ళున్న చిన్న చెలిమ మేలుకదా! తాగడానికుపకరిస్తుంది.

**నీతి యెరుంగని నీచున**
**కాతత రాజ్యము లభింప నధికుం దగునా**
**నాతివలెను నటియించునె**
**కోతికి స్త్రీ వేషమిడిన గువ్వల చెన్నా!**